శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## Journal of the Telugu Academy

KAKINADA



దేశభాషలందు తెలుగు లెస్స


సంపుటము ౪౭ | విలంబి మాఘ ఫాల్గునములు | సంచిక ౬

# విషయసూచిక

# పాణినిః.

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తిః M. A.

గైర్వాణీ భువనస్య దిగ్గజవరా భారావనే సంస్తుతాః
స్తమ్భా వ్యాకరణాఖ్యధర్మసదన స్యాశ్యే స్తమ్భద్వయస్య యే
దీపా మార్గనిదర్శకాః పథి పతఞ్జల్యాదిమేధావినా
మధ్యాయాః కలితా భవన్తి సుకృతౌ య స్యాష్ట; వన్దే మునిమ్.

శబ్దామ్బుధౌ సంశయదుష్టసత్త్వే
నిరర్గళం వ్యాకరణాఖ్యనౌకామ్
యః కర్ణధార స్సమతారయ త్తం
వన్దే సదా పాణినిమౌనిరాజమ్.

పతఞ్జలి ర్వ్యాఘ్రరుచి
ర్నాగేశో భట్టదీక్షితః
హరి ర్భట్టి ర్వామనో య
మన్వగచ్ఛన్ త మాశ్రయే.

మునీనాం కాశ్యపాదీనాం
శాబ్దికానాం మతానిచ
స్వీయమార్గం చ యో వ్యాకరోత్
త మీడే శాబ్దికం మునిమ్.

కృతే ర్యస్య మహాభాష్య
మేక స్యా ఏవ విద్యతే
సూత్రాణి చానవద్యాని
కలయే పాణినిం ఋషిమ్.

---

# సౌందరనంద సౌందర్యము.

శ్రీ నరసింహదేవర ఉమామహేశ్వరశాస్త్రి

నవ్యాంధ్రములో మధురకావ్యము లెన్నియో వెలసినవి. అందు కొన్ని రసఖండములుగా తేరినవి. కొన్ని యఖండమహాకావ్యము లైనవి. వీనిలో దుర్భాక రాజశేఖరశతావధానిగారి "రాణాప్రతాపసింహచరిత్ర," గడియారము వారి 'శివభారతము', మధునాపంతుల వారి 'ఆంధ్రపురాణము'; తుమ్మలచౌదరిగారి 'ఆత్మకథ', పింగళి కాటూరికవుల 'సౌందరనందము' ఈనాటి తెలుగుసాహిత్యమునకు వన్నె బెట్టునిండు కావ్యములు—ఇది యొక కావ్యపంచకము—ప్రకృతము సౌందరనంద కావ్యసౌందర్యము.

పెద్దకవుల లెక్కలో పరిగణనకు వచ్చినవారిలో గుర్తింపదగినవి ప్రతిభావ్యుత్పత్తులు. రెండును సమముగా మిళితమైనకవిత వన్నె గాంచును. దానిలో జాతీయతాగ్రంథము మరింత మెఱుగు నిచ్చును. జంటకవులహృదయములపంట యీకృతి. ఇది మనయాంధ్రమున కావలసినంత పేరు దెచ్చుకొన్నది. రచయితలను మహాకవులను జేసినది. ఇది పరమస్వతంత్రకావ్యము. సంస్కృతమున అశ్వఘోషుని సౌందరనంద మున్నది. పేరులోనియందమునమాత్రమే. ఆపేరు పెట్టుకొన్నారు గాని రచనావైచిత్ర్యమంతయు వీరిసొంతము.

స్వతంత్రకృతుల నిర్వహించుటలో కొన్నిచోటుల కవి ప్రతిభ పోగొట్టుకొనుచుండును, కాని వీరిస్వాతంత్ర్యము, ప్రతిభావిశేషము కొనియాడదగినది. కావ్యలోకమున నిది యొక క్రొత్త ఎత్తుగడ. భావసమృద్ధి రససమృద్ధి గలిగి ధర్మనిష్ఠాగరిష్ఠ మగుసతీవృత్తముతో మనోహర మగు సుక్తివైచిత్రితో గుణవంతముగ సాగిన మహాకావ్య మిది. రాశిలో చిన్నదే కావచ్చును. గుణసమృద్ధి కావలసినంత కలదు.

మొదటినుండియు వీరు కావ్యమున క్రొత్తదారు లేరుకొన్నారు. కావ్యములో సర్వదా నూతనప్రియత గన్పడును. నూత్నకవిత్వకవిత్వ వల్లి—"వాసనల్ ముంచుకొనఁగ నవప్రసవముల్ విరబూచుచు నున్న దీవు కల్పించిన పాదులందు"—త్రోక్కఁగదరయ్యా నవధర్మమార్గముఁ జరింపరాదె నవధర్మము—నవీనసృష్టిపరిణామ మిటుల్ నెరవేరెనో యుఁగ—ఇత్యాదిగా తమకు గలనవ్యతలోని అభిరతి చూపుకొన్నారు. ఈనవ్యత ఇతివృత్తము తీసికొనుటలోనే కాక భావమునను నొడికారము నను క్రొత్తక్రొత్తదారులు చూపినది. ప్రాచీనత పీడక, నవీనత నేరు టయే యిచటినవ్యత. అభ్యుదయ మని నేలవిడిచినసాము కారాదు గదా!

అద్యతనాంధ్రకవి ప్రపంచనిర్మాతకు భక్తిమై నుడుగరల్ ఘటి యించెడిపూన్కి — ఉదారభావప్రసాదగుణోత్ఫుల్లకృతిప్రసూనవిగళ న్మారందధారాసురాపగ నోలాడి రచించి తెచ్చిన దీకృతి. ఇందలి భావప్రసన్నత, మారందధారాసురాపగ నోలాడినకవితాధార పరి కింతము—బుద్ధుడు నిర్వాణపథము కనుగొని మానవకోటి నుద్ధరింప స్వదేశమునకు వచ్చి బౌద్ధభిక్షులుగ ప్రజలను చేర్చికొని వారిద్వారా మతబోధ, జీవకారుణ్యము, అనాథసేవ, మానవ సంస్కృతి సాధించిన పుణ్యగాథ. ఇతివృత్తము.

బుద్ధునిసోదరుడు నందుడు. అతనివలపుతీవ సుందరి.

"తానా సుందరనందు డవ్వెలదియా తన్వంగమాధుర్యలీ
లానంతైకనిధాన మొండొరులప్రేమాలాపకేళీవినో
దానూనానుభవమ్ములా మదనవిద్యాదైశికమ్ముల్ ; నముల్
కానఁగ రాదుగదోయి కామజనలోకమ్మందు నాదోయికిన్".

ఈప్రణయోపాసకులను బౌద్ధభిక్షుల గావించి లోకకల్యాణమున కాదం పతుల నాదర్శమూర్తులుగ చూపిన ధర్మగాథ యిది. జీవప్రచయిత లకు ధర్మనిష్ఠ యొకయాధిక్యత జేకూర్చును.

సౌందరనందము తొమ్మిదిసర్గలు. పునరాగమనము, భిక్షాగమనము పరివ్రాజనము, నిరీక్షణము, అనుతాపము, ఉపదేశము, ధర్మసంవాదము, అనుజ్ఞ, సహధర్మచర్యము ఇవి తొమ్మిదిరసఖండములు.

ప్రథమసర్గలో కావ్యారంభ మిటు లున్నది:—

"యన్మహాత్యాగమహిమమ్ము నాలకించి
మూడుకాలముల్ రోమాంచమును వహించు
నేడుదీవులకున్ బ్రాకి యెవని ధర్మ
లతలు నన లెత్తె నా శాక్యపతి నుతుండు".

ఇది చాలవిలక్షణముగ దోచుక్రొత్తకృత్యాది. ఏమహాకావ్యములో నిట్టి యారంభ ముండదు. దీనిలోనియందము జూడదగినది. ఈసర్గమున బుద్ధుని స్వదేశపునరాగమనము వర్ణితము. పల్లెల పట్టణముల నవారిగ ధర్మబీజములు జల్లుచు నేగుట—పండితు డైనబ్రాహ్మణుడు పామరు డైననిషాదుడు కేల్దండలు బట్టి పోదగినదారి ప్రజాతతికి చూపుచు కపిలవస్తుపురము వచ్చుట. వచ్చినబోధిసత్త్వుని జూచిన ప్రజలు:—

"మున్ను గురాలజంటలను బూన్చిన బంగరు తేరివగ్గముల్
చెన్నడు తాల్పగా పరిగచేలలు దాలిచి తూర్పుగొండపై
నున్న సరోజబాంధవుని యొవ్వన నేగెడిరాచబిడ్డ కా
పన్ననిమేసఁ గావియును బాదచరత్వము గక్షపాలయున్.

అనుకొనుచు తీర్థమున కేగినటు లేగి మ్రొక్కిరి. తడియారని కన్గవయు బాడియారిననోరు నౌచు దనయా! యనుచు మునలిరాజుకూడ శాక్యమునిని దర్శించెను. బోధిసత్త్వు డైనభర్తను జూచుటకు వచ్చినయశోధరను చిత్రించిన యారసఖండము నిరుపమానము.

కజ్జలహీనమై కాంతిబాసిన కనుంగొనలందు బాష్పాంబుకణము లురల
విగతసంస్కారమై వేలుపెన్నెరికురుల్ సెదరి వెన్నునఁ జిక్కుజీరువడగ
వసివాళ్ళువాడిన పసిసిమైతీవ సంభ్రమయానవశతఁ గంపము వహింప
బాలిసచెక్కిళ్ళ పయిపయిన్ జాలువారిన కంటినీరు చారికలు గట్ట

నంతిపురి వీడి వచ్చి శూన్యావలోక
నముల గాంతుని గనుచు రూపము వహించు
శోక మన దాల నిల్చె యశోధరయును
కొడుకుకూకటి నొక కేలఁ బుడికికొనుచు.

ఇపుడీయశోధరను ఇచటికే దెచ్చుట యొకలోకోత్తరవిషయము. ఇట్టి సన్నివేశమును బోషించుటలో కవికి గలప్రతిభ పరీక్షకు బడును. తండ్రి వచ్చెను. భార్య గన్నబిడ్డ దర్శించిరి. కాని శాక్యముని కందఱు ప్రజలు వీరు నొకతీరువారే. అతడిచ్చినసందేశ మందఱకు నొక్కటియె. ఇక్కడ బుద్ధునిపాత్రపోషణము గొప్పది. బుద్ధుడు బోధగావించెను. వృద్ధరాజు, తక్కినప్రజలు దీక్ష గైకొని బౌద్ధులైరి.

పతిపదాబ్జాతముల వ్రాలి పాదధూళి
తనయునకు రక్షగా మోముఁదమ్మి నిలిపి
నీ కిదే జోత లనిపించె నిర్వికార
మానస యశోధర గుణప్రమూనలతిక.

ఇదియొక నూతనసృష్టి :—

ఇంకొకవైశిష్ట్యకత. రాబోవుసర్గములం దొకక్రొత్తపద్ధతి కలదు. సర్గలోని సారాంశమును చెప్పక చెప్పునొకపద్యమును సర్గారంభమున నదుకుట. అది చదువుటతో ముందునర్గలోని వివిధాంశములు ద్యోతకము లగుట. ద్వితీయసర్గమున సుందరనందుల రాగరసము వర్ణితము. ఆసర్గము మొదటనుంచిన యీవృత్తము జూడుడు. ఇం దెంతటికవితాపాటవము శృంగారరససిద్ధి గలవో !

చెవిదాకఁ గొనయమ్ము లాగి చెఱకుఁసింగాణి నీ వెక్కుపె
ట్టువిలాసంబును లేతన వ్వొలయుచూడ్కుల్ మెప్పు లందీయగా
నవలోకింపుచు బూవుటమ్ము రతి నీ కందింప డెందమ్ములన్
గవియ న్నా కెుసిలత్ప్రశుద్ధికి నమస్కారంబు విరాణధ్వజా !

రాబోవు శృంగారరసమున కిది నాంది. ఈసర్గమున శృంగారము సీమలు దాటినది.

ఈయుక్తివైచిత్రి విలువగట్టరానిది :—

ఎఱ్ఱసెరల నందునిచూపు లింతి మూన
నేందునకుఁ గెంపులనివాళులెత్త నతివ
కజ్జలపుఁజూడ్కి ప్రియునివక్షఃకవాటి
గట్టుఁ దోరణములు నల్లకల్వపూల.

రచయితలభావనాబలమున కిది చక్కనియుదాహరణము :—

బ్రతుకు నిక్కమ్మయేని యవ్వారిపట్ల
విరతిలేనివ్వప్నమ్మునా జరుగఁబోలు,
బ్రతుకు నిక్కముగాక స్వప్నమగునేని
సత్యమై తోపబోలు నాజంపతులకు.

ఇటుపై నొకచక్కని ప్రేమవిలాసము. వర్ణితము అత్యంత సహజము. సహజశృంగారమును చిత్రించుటకు చేయితిరిగినచతురత కావలెను. నందునిచేతిలో దర్పణమున్నది. దానిలో నీడను చూచుకొనుచు తనకపోలములపై పత్రభంగములు దిద్దుకొనుసుందరి నాథుని మోములో ముద్దులుగుల్కు విలాసములపొలుపునకు మురియుచున్నది. అంతలో నాథుడు 'ఉఫ్' అనినాడు. ఊర్పుతుంపురులు తళతళలాడి యద్దములోని ప్రతిబింబమును మాసినవి. నాథునిపనికి మెచ్చువచ్చియు హృదయమున దాచి కినుక వహించినది. భర్త ఆమెపాదములు పట్టెను. వేలుకో వేసుకొనెను. తన్వి పకాలున నవ్వి 'యింతలోనే నడలేగ దోయి, మనబింకములింతపాటివా' 'కాపరకూన రైతి' వని కౌఁగిట చేర్చి చెక్కులు దువ్వెను. దీనిలో నందసుందరుల యవ్యాజానురాగము నిష్కల్మషహృదయములు చిత్రింపబడినవి. రాబోవునియోగమునకా యింత యున్నతి నందిన దీరనస్థాయి యనిపించును. నవీనమార్గమున నకృతక మగుప్రణయమును పోషించుటలో యీకవులది చక్కనిచేయి. "వెలది! యీరాగలతలు పుష్పించునట్లు లీమనోరథములు ఫలియించునట్లుదరు లొరసి పాఱుసీమను తాప్రవంతిఁ దేలిపోదము పెఱితలం పేల

మనకు?" అనుకొనుచున్నంతలో గౌతమర్షి భిక్షాటనమున కాయింటి కేగుదెంచెను. ఈప్రవేశ మొకయుజ్జ్వలత దెచ్చుకొన్నది. ఇది శ్రీనాథుని తీరు గలది.

"ఉడురాజోపలఘట్టనాసుభగమై వ్యోమమ్ముఁ జుంబించు మేల్
పడకింటన్ లలితోపభోగకలనాపారీణుడై నందు డా
మడతిన్ గూడి యిటున్నవేళఁ బిలిచెన్ మధ్యాహ్నభిక్షార్థియై
గడపన్ మెట్టినగౌతముండు మను భిక్షాం దేహి యన్ వాకునన్".

కాని లోనుండి అస్తి నాస్తి యనువ ల్కేమియు రాక వెడలిపోయినాడు. తెలిసి చింతించిన నందుడు "ఎడయని ధర్మరాగ మెటు లేనొకముందడు గేయ రెండుమూడడుగులు పేర్మిధర్మమవు డాతని వెన్కకు ద్రోయ" బుద్ధునికడ కరిగినాడు.

తృతీయసర్గమున నందుడు బుద్ధుని చేరుట—హితము బోధింప బుద్ధుని ఆజ్ఞచే శిష్యులు బలవంతముగ నందుని భిక్షుకుని జేయుట.

"భిక్షుమండలి చేజిక్కి పెనగులాడి, వేడుకొని బిట్టుగా విలపించి కసరి విసివి చేష్టలుడక్కి సొమ్మసిలి వ్రాలి సుందరీప్రాణధనము భిక్షులకుఁదక్కె" పరివ్రాజకు డయ్యెను. ఈతని యవస్థల దెలుపునీశబ్దముల కూర్పు శ్రీనాథుని బోలినకూర్పు. ఇం దాతని హృదయవేదన స్పష్టము. అందుననే 'ఆంధ్రరచయితలు' దీనిని ప్రాతక్రొత్తలసేతుబంధ మన్నది.

నాలుగవసర్గమున సుందరి నందునికై నిరీక్షణము, విలాపము వర్ణితము. ఇందలిసుందరి, రాగరంజితహృదయమున రేగినతుపాను, ఆమె వేదన చక్కగ చిత్రితమై మనను కఱగించును. భర్త పరస్త్రీలోలు డయ్యెనేమో రాలే దనుకొన్నదిమొదట సుందరి.

"అరసభావ మానెనరు లాముదిపెమ్మలు నట్టినుద్దు లా
తేరిసపొంకముల్ కళలతేరిన కూర్పులు కస్తురింపు లా
గారము లెల్లఁ బోయి పెఱకాంతకుఁ జిక్కుట యైనచో నమ
స్కార మొనర్పఁ జెల్లెడిని గాక మరేమన జంచలాత్ముని"

బుద్ధుడు నందుని భిక్షునిగా జేసె నని విని చింతించుచున్నది. కవుల హృదయము పరామర్శింపుడు.

"శోకరూపిణి నైన యశోధరాంబ కీర్తిఁ దోడికోడలనై తినిజము"

"ఇ దెట్టు లొప్పితివి మొగ్గనేఁ దుంచుట పిందె కోయుటల్"

"సత్తైములో సహింపవలె శాశ్వతికమ్ముగ భర్తృయోగసం

పత్తికి భాజనంబ వయి వర్ధిలు మమ్మరో! యంటి కాదె".

అన్నది. ఇందలి భర్తృయోగసంపత్తికి భాజన మగుటలోని శ్లేషమనోజ్ఞము. హృదయమైశాల్యమును చూపును.

'అయిదవసర్గము బోనుబడ్డ భద్రగజముపోలిక సుందు' నందుని విషాదము—అతనిపరితాప మిది.

"కిసలయకోమల మ్మయిన కేలు గ్రహించినదాదిగా రసో

ల్లసనమనోహరంబును గళానవతారమణీయమున్ నితాం

తసుఖద మైనసీదుచరితమ్మున నొకొ్కకభావ మిప్డు మా

నసమును బాఱి నీ సెరతనంబునకుఁ బ్రణమిల్లజేసెడుఁ".

ఇది నందుని పశ్చాత్తాపము. పాఠకుల నాస్తికి దెచ్చుకావ్య మిది యని యీఘట్టము నిరూపించగలదు. హృదయము జూపు నీసవ్యసుధాధార చవిచూడుడు.

"వలపుల్ వర్షిణి బాఱఁ గౌగిటఁ గదింపఁ బాత్రలై నిండు చూ

పులకుఁ వెన్నెలవై శ్రవోయుగళి కింపుల్ నింపుగానమ్మ వై

యలరుంచానిని యయ్యు నూర్పులకుఁ బై నాత్మైకభోగ్యమ్మ వై

తలపుల్ దాటి యభిన్నవై తుది మహాత్మా నాకు లేవైతివే!"

శృంగార మన్ని పోషణములకన్నను పెద్దపని. అందునను పోతన వలె శృంగారము వెంట అధ్యాత్మికత చూపుట మరింత కష్టము. ఇందు కృతకృత్యమగుట దైవదత్తము. ప్రకృతమున నీకావ్య మట్టిది. సుందరీ నందుల ప్రణయగాథలో బుద్ధునితత్త్వము పోషించి కృతకృత్యు లైన

నా రాజంటకవులు. ఇం దంచులుముంచు శృంగారము, శాంతపావనగం భీరసరళభావబంధుర మగుతత్త్వము పోషింపబడినవి.

బుద్ధుడు, చింతించునందునకు హితము దెల్పఁ గౌఁగిటఁ జేర్చెను. ఈచేర్పులోని స్వతంత్రిత నవీనభావనాబలము ప్రశంసనీయములు.

"వన్నె దొఱంగి క్రొంజిగురు వాడి కృశించినలేతతీవకుఁ
వెన్నెల జల్లుక్రొమ్మొసిమి పెట్టినరీతిఁ గుమారనందుఁ డా
యన్న కవుంగిట న్నిలిచినంతనె కీడ్వడి యున్నయంగముల్
క్రొన్నవకంబు నత్తువయుఁ గొన్నటు లాయె మనంబు రెక్కొనెన్."

ఇది చాల క్రొత్తభావము. బుద్ధుడు కౌగిలించునంతలో నందునియవయవములు క్రొన్నవకము సత్తువ గొనుట. ఇది బుద్ధిని లో నిల్పిన ప్రత్యేకత- కవులలో గలప్రత్యేకత.

ఇక బుద్ధబోధము రసనమంచితమై ఉత్తమజాతీయత జూపు పరమరమ్యఘట్టము. ఇందు కవులధార్మికత తెల్లము. "కుమారా! నీ యోగమనము మాఁవిహారమునకు మహోత్సవ మగు నని తెచ్చితిని. నీవంటివా డిటుల కంట నీర్వెట్ట తగదు. శోకమోహములను వీడుము. సంసారారణ్యమున హింసారంభముననా, సుఖము దేహికి లేదు.

"పాపిపాదోపరితలములు
దాసీజనకల్పమానతత్తద్భోగో
ల్లాసలసితాత్ము లెల్ల ద
యాసారవిదూరులో మహాంధులో తనయా!"

"వేగయినట్టివేదనల పెల్లునము న్నొకుగుల్లు గూలి యు
య్యో! గడికాల్లు నైచిక్కొని రెుండొటఁ బాచుచుఁ గ్రుమ్ములాడునీ
లేగలవంటిలో కులమలీమసభావముఁ బాపి ప్రోతురా
రాగిలి భోగముల్ గుడుతురా! నినువంటి నరేంద్రపుత్రికుల్."

"ఇనీ! పుష్పబాణాగమాధ్యత్మ్యప్రాథమికుండ వై తిరుగజన్నె నీ కిటుల్ సోదరా!"

"కుతర్క నల్లపూసయుఁ గుండలోన
వడ్లగింజయుఁ గనుల బావ్పములు లేక
కడుపు చుమ్మలు చుట్టగా నడలు చున్న
తల్లులం గాంచకుంటి వోతమ్ముఁగుఱ్ఱ!"

ఇటు లుపదేశించి ప్రణయోపాసిని తత్త్వోపాసిని గావించును. బుద్ధునిచే చేయించినబోధనలో లోకవృత్తము, అనాథులకూయి, పాప కూపవిపన్నాత్మల పరివృత్తి- వారి నుద్ధరించి, మతహితము, మానవ సంస్కారము, సత్యాహింసశీలాదిరక్షణము- గోరుట ప్రధాన మని తెల్పుటలో కవులజాతీయత గజ్జెలుగట్టి యాడినది.

సప్తమసర్గమున బుద్ధనందుల ధర్మసంవాదము. ప్రేమలో నందునినైదున్యము వాని నవీనాకాంక్షలు- దానిపై బుద్ధునిపరిశిక్షము రమ్యాతిరమ్యముగ సాగినవి. నందు డనును:-"హెచ్చె మెఱుఁగనిభావముల్ పొంది పొనగి వలపునెత్తావు లీనెడుభాగ్య మల్ప మగునె గురుదేవ!"

"వసివాళ్వాడ దొకప్పుడు
గనుగందదు మేల్మిచాయ కగ్గదుఁ దావుల్
కొసరుమరందము చిలుకును
వినువక యెదఁ దాల్తు నట్టిప్రేమకుసుమ్ముల్."

ఇట్టి నూతనములు పింగళికాటూరికవుల సొమ్ములు. వారిచూపు లీలోకముననే కాదు. లోకాంతరమునకుగూడ పోయినవి:—

"నా కీలోకముతోఁ బనేమి విను మన్నా! పాలమున్నీటిలో
నేకాంత మ్మగుచోఁ బరివాళములలో నేపారుద్వీపమ్ములో
నాకుల్ బాలనిపూలు వాడనివసంతారామమధ్యమ్ములో
రాకాచంద్రసహస్రముల్ వెలుగుహర్మ్యాగ్రమ్మునం దొక్కటన్".

"నాకుం బ్రాణముప్రాణ మైనచెలితో నానాసుఖమ్ముల్ లతా
నీకమ్ముల్ పెనగొన్నడోలికలలో నిఃఖేదదివ్యామృత
స్వీకారమ్ము భజింపుచుం బసమయముల్ సీమల్ వెసం దాటి యే
కాకారమ్మును నిత్యమై నెగడు నయ్యానంద మర్థించెదన్.''

దానిపై బోధిసత్త్వ డనును:—

"తా నొకగడ్డ కట్టుకొని తత్పరతన్ శిలలై నశించున
జ్ఞానుల కేడనోయి సుఖసంగతి! తాఁ దనయాలి, యాత్మసం
తానము, తోడబుట్టుగులు, తల్లియు దండ్రి కులమ్ము దేశముం
మానవు లెల్లప్రాణులు కుమార! సమస్తముఁ దాను గావలెన్."

నిసర్గనిశితముగ మాధురీధురీణముగా గౌతముడు ధర్మసారము లుపన్య
సింపగా నాతనిహృదయము తదర్థమునం దొకింత యుద్గృహీత మైనది.
కాని పత్నినిగూడ భిక్షుకిగ జేసి బౌద్ధధర్మము పాలింపవలె నని కోరు
కొనెను. వీనిపరిణామమున నిది యొకచక్కనికల్పనము. అట సుంద
రియు భర్తతోబాటు తనకు నాదీక్ష నొసగరాదా! యని చిలుకతో
ననును. ఒకేకోరిక నిరువురిలో నొకేసమయమున బుట్టించుట వారి
యవ్యాజప్రేమకు బలము. చక్కనిటీ కిది.

బుద్ధుడు:—

అనదృశమ్మగు బ్రహ్మచర్యవ్రతమ్ము
బాలని మ్మొనరించుచు బౌద్ధధర్మ
మూన నధికారిణులు నుండురేని యట్టి
శీలవతులకు నాహ్వానసిద్ధి యగుత!

అని అంగీకరించెను.

ఇప్పుడు సుందరానందులు ఆదర్శబౌద్ధమతవ్యాపకులు!
సౌందరనందము భాషాలోకమున నొకసౌందర్యతార!

---

# గ్రంథ స్వీకారము

1. శృంగారతిలకము:— ఆంధ్రీకర్త-
   శ్రీఉప్పాడ రాజారావుగారు, కాకినాడ.
2. శ్రీబుద్ధచరిత్రము:— ప్రకాశకులు-
   జీవకారుణ్యసంఘము, నరసారావుపేట.
3. శబల:— కర్త: అభినవతిక్కన-
   శ్రీతుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు.
4. ఆంధ్రసేవాకథలు:— కర్త: శ్రీజాస్తి వేంకటనరసయ్యగారు,
   చిలకలూరుపేట.
5. విద్వాన్ శ్రీ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యముగారి లఘుకృతులు.
6. సింహబలి—: కర్త: శ్రీమోటూరి వేంకటరావుగారు, విజయనగరము
7. శ్రీవిలాసము } కర్త: విద్వత్కవి శ్రీ ఆకుండి వేంకట
8. సుందరీపరిణయము } శాస్త్రిగారు, విజయనగరము.
9. మదాలసచరిత్రము: (మూలమునకు నాంధ్రవివరణము)
   ప్రకాశకులు శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు- చిత్తూరుజిల్లా.
10. దేవీనవతి (ఆంధ్రీకర్త):—శ్రీ మధునాపంతుల సూరయ్యశాస్త్రి
    గారు, పల్లిపాలెము.
11. గంగాపరిణయము-ప్రబంధము } కర్త: మధురకవి మూలా పేరన్న
12. శ్రీరామప్రభుశతకము } శాస్త్రిగారు,. బిలాసపురం, మ॥ప్ర॥
13. ఆంధ్రముకుందమాల }
13. జీవసమాధి (అనార్కలీచరిత్రము) } డిటో
14. Anuals of Oriental Research:— Vol. XV (1958-59) Part I
    Publishers- University of Madras.

* పై గ్రంథములను పరిషత్తు కృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించినది- వీని
పయి సమీక్షలు క్రమముగా భావిసంచికలలో వెలువడును.

సంపాదకుఁడు.

[గతిసంచితతరుకాయి]

శ్లో. మహానుభావసంసర్గః
కస్య నోన్నతికారణమ్
ప్రవిశ్య గంగాం రథ్యాంబు
త్రిదశైరపి సేవ్యతే.

తే. గీ. మహి మహాశయభవ్యసంపర్కగరిమ
మెవని కున్నతిహేతువై యెనఁగకుండు ?
కలుషరథ్యాజలంబులు గంగఁ గలిసి
విబుధతతిచేతఁ గూడ సేవింపఁబడవె !

శ్లో. అన్యా జగద్ధితమయీ మనసః ప్రవృత్తి
రన్యైవ కాపి రచనా వచనావళీనాం
లోకోత్తరా చ కృతి రాకృతి రార్తహృద్యా
విద్యావతాం సకల మేవ గిరాం దవీయః.

ఉ. మానసికప్రవృత్తి లసమానజగద్ధితశక్తి వేఱు, వా
చానుపమానసంగ్రథనహారివిధానము వేఱుతీరు, వి
ద్యానిరవద్యసజ్జనుల యాకృతులుం గృతు లార్తహృద్యముల్
మానితముల్ దవీయములు మంజువచోమృతభూరిధారకున్.

శ్లో. హంసో న భాతి బలిభోజనబృందమధ్యే
గోమాయుమండలగతో న విభాతి సింహః
జాత్యో న భాతి తురగః ఖరయూథమధ్యే
విద్వా న్న భాతి పురుషేషు నిరక్షరేషు.

మ. ఖరయూథాంతరమందు నున్నతతురంగం బెట్లు భాసించు ? దు
ర్భరగోమాయుచయంబునం దెటులు శోభంగాంచుఁ బంచాస్యముం
గరటాంతర్గత మాచు నేకరణి పీకం బెందు మారాళముం
విరసానక్షరకుక్షులైన జనులం విద్వాంసుఁ డెట్లొప్పెడిన్.

శ్లో. విదుషాం వదనా ద్వాచః
సహసా యాంతి నో బహిః
యాతా శ్చే న్న పరాంచన్తి
ద్విరదానాం రదా ఇవ.

తే. గీ. పండితాఖండలుని మోమునుండి యెపుడు
గడురయంబున నుడి బహిర్గతము గాదు
కరము వెలువడ దానికిఁ దిరుగు లేదు
సమదదంతావళములదంతములు వోలె.

శ్లో. విశ్వాభిరామగుణగౌరవగుంఫితానాం
రోషోఽపి నిర్మలధియాం రమణీయ ఏవ
లోకంపృణైః పరిమళైః పరిపూరితస్య
కాశ్మీరజస్య కటుతాపి నితాంతరమ్యా.

చ. అమలినశేముషీమహితు లై యభిరామగుణాలవాలు రై
యమరెడు నుత్తమోత్తముల యాగ్రహమున్ రమణీయమేయగున్
అమితసువాసనాగుణము లందినకుంకుమపూవులోఁ గటు
త్వము చెలలాడుచున్నను నితాంతమనోహరతన్ భజింపదే.

శ్లో గుణై రుత్తుంగతాం యాతి
న తు సింహాసనాదినా
ప్రాసాదశిఖరస్థోఽపి
కాకః కిం గరుడాయతే.

తే. గీ. నుతగుణగణంబుచేత నున్నతిని గాంచుఁ
గాని సింహాసనస్థితికలనఁ గాదు
ఉచ్చతరసౌధశిఖరమం దుండుఁగాక
కాక మెన్నటికైనను గరుడుఁ డగునె?

శ్లో. తుంగాత్మనాం తుంగరసా స్సమర్థా
మనోరథా న్పూరయితుం న నీచాః
ధారాధరా ఏవ ధరాధరాణాం
నిదాఘదాహప్రశమే న నద్యః.

తే. గీ. అధికులమనోరథముఁ దీర్ప నధికపరవ
వరులె శక్తులు, నీచులవలనఁ గాదు;
ధర ధరాధరనై దాఘతాప మడఁపఁ
గలవె? ధారాధరావళి గాక నదులు.

శ్లో. సత్పూరుషః ఖలు హితాచరణై రమంద
మానందయ త్యఖిలలోక మనుక్త ఏవ
ఆరాధితః కథయ కేన కరై రుదారై
రిందు ర్వికాసయతి కైరవిణీకులాని.

ఉ. కోరక యే హితమ్ము లొనఁగూరిచి లోకచయమ్ము నెల్ల స
త్పూరుషరత్న మత్యధికమోదరసాంబుధి ముంచి తేలుచున్
"కైరవిణీకులమ్మును వికాస మొనర్పుము నీ" వటంచు నె
వ్వారయినన్ కళానిధిని బ్రార్థనలం బచరించియుండిరే?

శ్లో. సుజనోఽపి హి కుప్యతి భృశ
మనవసరక్షేన యాచిత స్సుహృదా
సురతాంతరే రుదంతం
ప్రియ మపి పుత్రం శప త్యహో! జననీ.

మ. సుజనుం డయ్యుఁ గరమ్ము కోపకలనం జూపున్ హితుం డొద్దకున్
విజయంచేసి యకాలమందు నిరులన్ వేడంగ; రోదించుచో
నజహద్వైఖరి సంగమాంతరమునం దావేశ మేపారఁగా
నిజపుత్రుం గడు దూరదే జనని యెంతే వానిఁ బ్రేమించియున్.

శ్లో. సుజనో హి యాతి శాంతిం
పరహితబుద్ధి ర్వినాశకాలేఽపి
ఛిన్నోఽపి చందనతరు
స్సురభయతి ముఖం కుఠారస్య.

తే. గీ. సజ్జనుండు వినాశావసరమునందు
నందు నన్యహితైషియై యతను శాంతి
సారెకుఁ గుఠారధారఁ జాటీరతరువు
చీల్పఁబడుచున్న వాసింపఁ జేయకున్నె?

శ్లో. కస్మా దిందు రసౌ ధినోతి జగతీం పీయూషగర్భైః కరైః
కస్మా ద్వా జలధార యైష ధరణీం ధారాధర స్సించతి
భ్రామం భ్రామ మయం చ నందయతి వా కస్మాత్ త్రిలోకీం రవి
స్సాధూనాం హి పరోపకారకరణే నో విద్యపేక్షం మనః.

శా. ఆలింపన్ విధి లే, దపేక్షయును లే, దన్యోపకారక్రియా
లోలం బౌసుజనాంతరంగమునకున్; లోకత్రయిం జుట్టుచున్
ఏలా రంజిలఁ జేయు భానుఁడు? ఘనుం డేలా యిలన్ వారిఁ బ్ర
క్షాళించున్? విధుఁ డేల తేలుచును లోకంబున్ సుధారోచులన్.

శ్లో. పరార్థవ్యాసంగా దుపజహ దథ స్వార్థపరతా
మభేదైకత్వం యో వహతి గుణభూతేషు సతతం
స్వభావా ద్యస్యాంతః స్ఫురతి లలితో దాత్యమహిమా
సమర్థో యో నిత్యం స జయతితరాం కోఽపి పురుషః.

చ. అలరుఁ బరార్థజీవి యయి స్వార్థపరత్వము వీడి, భేదధీ
కలనఁ ద్యజించు, నేకతను గాంచు సదా గుణభూతసంతతిన్
లలితవదాన్యతామహిమలన్ వెలుఁగొందు, స్వభావసంగతిన్
గలితయశోవిభాసురుఁ డొకానొకపూరుషభూషణుం డిలన్.

శ్లో. ఉపకార మేవ తనుతే
విపద్గత స్సద్గుణో నితరాం
మూర్ఛాం గతో మృతో వా
నిదర్శనం పారదోఽత్ర రసః.

కం. ఉపకారంబే చేయుఁ
విపద్గతుఁడు నయ్యు సుగుణవిశ్రుతుఁ డెపుడున్
ఉపమింపవచ్చు మూర్ఛయొ
యపమృత్యువొ కనినపారదాఖ్యరసంబున్.

శ్లో. శూన్యేఽపి చ గుణవత్తా
మాతన్వాన స్స్వకీయగుణజాలైః
వివరాణి ముద్రియన్ దాశ్రి
గూర్ణాయు రివేహ సజ్జనో జయతి.

తే. గీ. ఏమియును లేకపోయిన నురువరగుణ
వత్త నిజగుణగణమునఁ బరిఢవించి
వివరములనెల్లఁ దా మూసి విజయి యగుచు
సజ్జనుం డందు నూర్ణాయుసామ్యగరిమ.

శ్లో. గిరయో గురవ స్తేభ్యో
వ్యుర్వీ గుర్వీ తతోఽపి జగదండం
తస్మా ద ప్యతిగురవః
ప్రళయేఽప్యచలా మహాత్మానః

ఆ. వె. వరధరాధరాళి గురు వగు, నద్దాని
కంటె గురువు ధర, జగంబు దాని
కంటె గురువు, ప్రళయకాలమందుం జలిం
పనిమహాత్ము లరయఁ బరమగురులు.

శ్లో. నాపేక్షా న చ దాక్షిణ్యం
న ప్రీతి ర్న చ సంగతిః
తథాపి హరతే తాపం
లోకానా మున్నతో ఘనః.

ఆ. వె. లేదు సంగతంబు లేదు దాక్షిణ్యము
లేదు ప్రీతి మఱియు లే దపేక్ష
యైన లోకతాప మంతయు మాన్పఁ మ
హోన్నతిం జరించుచున్నఘనుఁడు.

శ్లో. ఆపద్గతోఽపి చ మహాశయచక్రవర్తీ
విస్తారయ త్యకృతపూర్వ ముదారభావం
కాలాగురు ర్దహనమధ్యగత స్సమంతా
ల్లోకోత్తరం పరిమళం ప్రకటీకరోతి.

ఉ. ఆపదలందు సైతము మహాశయమూర్తి పురాధికంబుగాఁ
జూపు నుదారభావము; ససూత్కృశానుశిఖాంతరస్థలీ
స్థాపిత మౌచుఁ గాలుచు ససారపరీమళభారనిస్తుల
వ్యాపకతం రహించు నగురట్టులు హారియశోవిభాసి యై.

శ్లో. ఉపరికరవాలధారా
కారాః కూరా భుజంగమపుంగవాత్
అంతస్సాక్షాద్ద్రాక్షా
దీక్షాగురవో జయంతి కేఽపి జనాః.

తే. గీ. ఉపరి వేషము నిశితాసికుపితధార
ఘోరకాకోదరాధికకూర, మంత
రంగము ప్రశస్తగో స్తనీహారిభూరి
మధురమధురస మొక్కొక్క మానవునకు.

శ్లో. ఖల సజ్జన కార్పాస
రక్షైకహుతాశనః
పరదుఃఖాగ్నిశమన
మారుతః కేన వర్ణ్యతామ్.

తే. గీ. సాధుతూలావనమునఁ గృశానుఁ డగుచుఁ
బరులదుఃఖాగ్నిఁ జల్లార్ప వాయు వగుచు
నాత్మ నుప్పొంగుచున్ మింటి నంటుఖలుని
నిరత మేవారిగను వర్ణింపవలెనొ !

శ్లో. ఖలః కరోతి దౌరాత్మ్య
మలం పతతి సాధుషు
రావణేన హృతా సీతా
బంధనం తు మహోదధేః.

తే. గీ. ఖలుఁడు గావించునట్టి దుష్కార్యచయము
సాధుజనపుంగవుల నెల్ల బాధవెట్టు
రావణుఁడు తొల్లి జానకీరమణిఁ గొనఁగ
నంబురాశికి బంధనం బబ్బెఁగాదె !

శ్లో. అహ మేవ గురు స్సుదారుణానా
మితి హాలాహల ! మా స్మ తాత ! దృప్యః
నను సంతి భవాదృశాని భూయో
భువనేఽస్మిన్ వచనాని దుర్జనానామ్.

చ. అతిశయదారుణాచరణులందు ఘనుండను నేనె యంచు నీ
మతిఁ దలపోసి గర్వ మతిమాత్రిముఁ బూనకుమా హాలాహలా !
క్షితిని భవాదృశోగ్రులు వసింప రటంచు దలంపఁబోకు సం
తతపరిమ త్తదుష్టజనతావచనప్రచయంబు లేదొకో ?

శ్లో. నిష్ణాతోఽపి చ వేదాంతే
సాధుత్వం నైతి దుర్జనః
చిరం జలనిధౌ మగ్నో
మైనాక ఇవ మార్దవమ్.

తే. సర్వవేదాంతశాస్త్రనిష్ణాతుఁ డయ్యు
సాధుభావంబుఁ గనఁడు దుర్జనుఁడు; చిరము
తాను సాగరమున మగ్నమైనఁ గాని
మహితమైనాక మందునే మార్దవంబు ?

శ్లో. పరగుహ్యగుప్తినిపుణం
గుణమయ మఖిలై స్సమీహితం నితరాం
లలితాంబర మివ సజ్జన
మాఖవ ఇవ దూషయంతి ఖలాః.

తే. గీ. గుణమయంబును బరగుహ్యగుప్తి చణము
సఖిలజనవాంఛనీయంబు నంబరమును
మూషికంబులమాదిరి దూషితంబు
సనయ మొనరింతురి ఖలులు సజ్జనులతతిని.

శ్లో. కృత మపి మహోపకారం
పయ ఇవ పీత్వా నిరాతంకం
ప్రత్యుత హంతుం యతతే
కాకోదరసోదరః ఖలో జగతి.

ఆ. వె. ఘనపరోపకారమును నిరర్గళముగాఁ
బాలఁ గ్రోలులీలఁ జాల బడసి
చంపఁగడఁగు ఖలుఁడు చండకాకోదర
సోదరుండొ యెంచి చూడఁ బుడమి.

శ్లో. కస్తూరికాం తృణభుజా మటవీచరాణాం
విన్యస్య నాభిషు వధాయ వృథా చకార
మూఢో విధి స్స కిల దుర్జనలోలజిహ్వా
మూలేషు నిక్షిపతి చేత్సకలోపకారః.

చ. వనులఁ జరించుచుర్విఁ గరము బచ్చిక మేయు మృగాళినాభియం
దునిచెను గమ్మకస్తురి నదేమొ! విధి తా వృథగా వధార్థమై
యనువుగ దుర్జనోగ్రరసనావళిమూలములందు దాని నుం
చినయెడ లోకసంచయ మశేషముఁ గాంచు మహోపకారముల్.

శ్లో. హాలాహలం ఖలు పిపాసతి కౌతుకేన
కాలానలం పరిచుచుంబిషతి ప్రకామం
వ్యాళాధిపం చ యతతే పరిరబ్ధు మద్ధా
యో దుర్జనం వశయితుం తనుతే మనీషామ్.

చ. కుతుకమునన్ హాలాహలము గ్రోలుటయే యగుఁ, గాలకీలి వి
శ్రుతతనుసాహసం బెసఁగఁ జుంబనముం బొనరించుటే యగున్
తతభయదోరగాధిపు నతండ్రిగతిన్ గ్రహియించుటే యగున్
సతతము దుర్జనాధిపు వశంవదుఁ జేసికొనం దలంచుటల్.

శ్లో. పోతో దుస్తరవారిరాశితరణే దీపోఽంధకారాగమే
నిర్వాతే వ్యజనం మదాంధకరిణాం దర్పోపశాంత్యై సృణిః
ఇత్థం తద్భువి నాస్తి యస్య విధినా నోపాయచింతా కృతా
మన్యే దుర్జనచిత్తవృత్తిహరణే ధాతాపి భగ్నోద్యమః.

ఉ. వారిధిఁ దాఁటఁ బోతము, నవాతమునన్ వ్యజనమ్ము, సంధకా
రారభటిం బ్రదీపము, మదాంధమతంగజశాంతికై సృణిన్
ధారుణి మానవుల్ విషమతాశమనార్థ మొనర్చి రీక్రియన్
వారిజయోనియుం గుజనభావము మాన్ప వృథోద్యముం డగున్.

శ్లో. ఏకో విశ్వసతాం హరామ్యపఘృణః ప్రాణా నహం ప్రాణినాం
ఇత్యేవం పరిచింత్య మాత్మమనసి వ్యాధానుతాపం కృథాః
భూపానాం భవనేషు కించ విమలక్షేత్రేషు గూఢాశయాః
సాధూనా మరయో వసంతి కతిన త్వత్తుల్యకక్షా నరాః.

మ. అనుతాపమ్మును బొందఁబోకుము కిరాతా! ప్రాణిసంద్రోహజీ
వనముల్ నిష్కరుణన్ హరింతు ననుచున్ బల్మాఱు భావించుచున్
మనుజాధీశ్వరమందిరోదరములన్ సాధుప్రజాశాత్రవుల్
నినుఁ బోలంగలవారు కొందఱు నరుల్ లేరా! నిగూఢాశయుల్.

శ్లో. విశ్వాస్య మధురవచనైః సాధూన్ యే వంచయంతి నమ్రతమాః
తా నపి దధాసి మాతః! కాశ్యపి! యాత స్తవాపి చ వివేకః.

తే. గీ. పలుకుపలుకునఁ దేనియ లొలుకుచుండ
నమితవినయమ్ముఁ జూపుచు నధికసాధు
జనుల వంచించువారల నైత మంబ!
కాశ్యపీ! మోయుదువు వివేకమ్ము లేక.

శ్లో. లీలాలుంఠితశారదాపురమహాసంపద్భరాణాం పురో
విద్యాసద్మవినిర్గళత్కణముషో వల్గంతి చే త్పామరాః
అద్య శ్వః ఫణినాం శకుంతశిశవో దంతావళానాం శశాః
సింహానాం చ సుఖేన మూర్ధను పదం ధాస్యంతి సాలావృకాః.

చ. వరతరశారదానగరభాసురసంపదుదారసన్నిధిన్
సరుపమసత్కళాసదననిర్గళదేకకణాపహారులై
మెఱయుట పామరుల్; విహగముల్ ఫణిపై, శశముల్ ద్విపంబుపైఁ
జఱుశునకమ్ములుం గుపితసింహముపైఁ బదముల్ ఘటించుటే.

శ్లో. యశస్సౌరభ్యలశునః శాంతిశైత్యాపహారకః
కారుణ్యకుసుమాకాశః ఖల స్సజ్జనదుఃఖలః.

తే. గీ. విశదసుయశఃపరిమళలసనమూర్తి
శాంతిశీతలతాహుతాశనసుకీల
కరుణారసకుసుమావళీగగనసీమ
కమ్రగుణమాన్యసుజనదుఃఖలుఁడు ఖలుఁడు.

శ్లో. యుక్తం సభాయాం ఖలు మర్కటానాం
శాఖా స్తరూణాం మృదులాసనాని
సుభాషితం చీత్కృతి రాతిథేయీ
దంతై ర్నఖాగ్రైశ్చ విపాటితాని.

తే. గీ. అఖిలవానరపరిషత్సదంతరమున
శాఖిశాఖలె మంజులాసనము, లుదిత
చీత్కృతియె భాష, నఖరవిశేషదంత
దీరదారణమే యాతిథేయగరిమ.

శ్లో. ఆకాశ శ్చాంబరాఖ్యో హరి రితి గహనం దర్దుర స్యాభిధానం
కాకస్యాపి ద్విజత్వం విషముఘణపతే ర్నామ భోగీ భుజంగః
క్షుద్రాశ్మా శర్కరేతి ద్విరదమదజలం దాన మర్థేన శూన్యం
కేచి న్నామాని ధృత్వా జగతి తనుభృత స్సన్తి సాడంబరాణి.

సీ. అంబరాఖ్యాతివిఖ్యాతి నందు నభంబు
భేకంబు హరి యంచుఁ బిలువఁబడును
క్షుద్రోపలములు వొల్చున్ శర్కరాభిఖ్య
గాకలోకము ద్విజాఖ్యఁ వహించు
భుజగాభిధానంబు భోగినామంబును
దాఁ దాల్చు విషమకాకోదరంబు
కరిఘటాకటతటీపరిగళన్మదధార
దానపవిత్రాభిధాన మందు

తే. గీ. నార! యీసర్వసర్వంసహాతలమునఁ
గేవలాడంబరంబు లై చేవలేని
సార్థములుగాని నామధేయములు దాల్చి
కొందఱు శరీరధారులు కలుగుచుందు్రి.

శ్లో. ఛేద శ్చందనచూతచంపకవనే రక్షా కరీరద్రుమే
హింసా హంసమయూరకోకిలకులే కాకేషు లీలారతిః
మాతంగా త్ఖరవిక్రియ స్సమతులా కర్పూరకార్పాసయో
రేషా యత్ర విచారణా గుణగణే దేశాయ తస్మై నమః.

సీ. పాటీరచూతచంపకవనచ్ఛేదమ్ము
రక్షణవిధి కరీరమ్మునందు
కలహంసకేకికోకిలకులంబుల హింస
కాకంబునందు సస్నేహరతులు
ఉత్తుంగమాతంగయూథవిక్రియకర్మ
వక్రిగర్దభసమూహక్రియంబు
ఘనసారఘనసారకార్పాసముల సమ
తులలోన ఘటియించి తూచుటయును

తే. గీ. గుణగణవిచారణంబు లేకోశమందు
మచ్చునకుఁగూడ లేకుండ మసలుచుందు
రనిశ మెచ్చోట నట్టిదేశావతంస
మునకుఁ జేయెత్తి మిక్కిలి మొ్రక్కుకొందు.

శ్లో. చాతక స్త్రిచతురాన్ పయఃకణాన్
యాచతే జలధరం పిపాసయా
సోఽపి పూరయతి విశ్వ మంభసా
హన్త! హన్త! మహతా ముదారతా.

తే. గీ. జలధరుని మూఁడో నాలుగో జలకణములఁ
జాతకము వేఁడఁగఁ బిపాసచేత నతఁడు
పూరణ మొనర్చె ధర నంబుధారఁ గురిసి
స్తవ్య మౌ రార! ఘనులయౌదార్యగరిమ.

శ్లో. వితర వారిద! వారి దవాతురే
చిర ముపోషితచాతకపోతకే
ప్రచలితే మరుతి క్షణ మన్యథా
క్వ ను భవాన్ క్వ పయః క్వ ను చాతకః.

మ. కృపతో గ్రుక్కెఁడునీరు జాఱవిడరాదే నీరదా! చాతకం
బుపవాసంబుల వేగి వేగి కడ కెన్నోనాళ్ళకుం గాంచె నిన్
విపరీతానిల మేసరేగి యిటు దా వీవంగ నీ వెక్కడో!
యపు డంతర్గతనీరధార లెటనో! యాచాతకం బేడనో!

శ్లో. నిష్పక్షం శిశిరేణ, ధీవరగణై ర్నిర్మత్స్యనిష్కూర్మకం,
వ్యాధై ర్నిర్ద్విహగం, నిరంబు రవిణా, నిర్నాళికం దంతిభిః,
నిశ్శైవాల మకారి సూకరగణై, ర్నామైకమాత్రం సరః
హే సాధోద! పరోపకారక! పయోదానేన తత్పూరయ.

మ. హిమమున్ ధీవరులున్ గిరాతకులు ఛాయేశుండు దంతుల్ కిటుల్
క్రమతం గంజము మత్స్యకూర్మముల ఖేగంబున్ జలంబున్ మృణా
లముఁ గందంబు హరించెఁ బూర్ణ ముగ; నీలాలంబుఁ బూరింపు, నా
మమె శేషించి వసించునీసరసిఁ బ్రేమం బుంచి ధారాధరా!

శ్లో. ధారాధర! ధరా వారి ధారాభిః పరిపూరితా
ఖగతోఽన్తిటీపుటద్రోణీ పూరణే కిం ను తే శ్రమః.

కం. ధారాధర! ధరఁ బుష్కర,ధారాపూరిత మొనర్చుదార్ఢ్యము గలనీ
కేరీతి భార మగు ఖగ, చారుతోఽటీపుటంబుఁ జక్కఁగ నింపన్.

శ్లో. ధారాధర ! వివేకాత్మన్ ! వృథా వర్షసి వారిధౌ
చిరాశ్రితం కణాత్తృప్తం చాతకం కిం న లోకసే.

కం. చిరకాల మాశ్రయించుచుఁ
గరముఁ గణంబునకె తృప్తిఁ గనుచాతకముం
బరికింపవా ! వారిధి జల
ధర ! కురియుదు వేలరా వృథా సువివేకీ !

శ్లో. జలధర ! జలభరనికరైః పరిహర పరితాప ముత్థితం జగతః
నో చే దపసర దూరం హిమకరకరదర్శనం వితర.

కం. జలభరనికరముచేతన్, జలధర ! దూరీకరింపు జగతీతాపం
బుల; లేకుండినఁ దొలఁగుము, కలితసుధాకరకరాళిఁ గనఁగొననిమ్మా.

శ్లో. గర్జన్నంబు దదాతి తచ్చ కణికారూపేణ యత్రి క్వచి
త్కాలాపేక్షతయా ప్రదానసమయే నైల్యం విధత్తే ముఖే
పశ్చాత్పాండురతా ముపైతి లఘుతా మభ్యేతి భూయస్తరాం
వీరశ్రీప్రభురత్నశేఖరమణే! దాతా కియా న్వారిదః.

ఉ. ఇచ్చెడి దేమి శీకరములే, యవి గర్జిలుచుం గరమ్ము, దా
నిచ్చెడువేళ నీలత వహించు మొగమ్మున; వెల్లఁబాఱుఁ దై
పెచ్చు; లఘుత్వ మందు నటుపిమ్మట, నక్కట ! వీని నేమన
న్వచ్చును? నద్వదాన్యుఁ డనవచ్చునొకో జలదంబు నింతయున్.

శ్లో. అన్యే తే విహగాః పయోద ! పురతో ధావంతి తృష్ణాతురా
వాపీకూపతటాకసాగరసరిత్స్రోతస్సు బద్ధాదరాః
చిత్రం పశ్య య ఏష చాతకశిశు స్సృష్టోఽ ప్యకంఠోఽపి న
న్నాన్యం పశ్యతి నోపసర్పతి న చ ప్రస్తౌతి నోద్గాయతి.

చ. అతిశయతృష్ణచేత సరిదర్ణవకూపతటాకదీర్ఘికా
మృతమునకై విహంగము లమేయజవంబున బాఱుఁ గాని, శు
ష్కతఁ గనియున్ గళోష్ఠములఁ గంటివె వారిద ! చాతకార్భకం
బితరముఁ జేరఁబోదు, నుతియింపదు, చూడదు, పాడ దెన్నఁడున్.

శ్లో. నభసి నిరవలంబే సీదతా దీర్ఘకాలం
త్వదభిముఖనివిష్టోత్తానచంచూపుటేన
జలధర! జలధారా దూరత స్తావ దాస్తాం
ధ్వని రపి మధుర స్తే న శ్రుత శ్చాతకేన.

చ. కరము నిగిడ్చి నీకభిముఖంబుగ విచ్చినచంచుసంపుటిన్
జిర మవలంబముం గనక నిల్చె నభోంగణసీమ, నొక్కఁడీ
కరమున మేఘ! చాతకము గాంచకపోయినఁ బోవుఁగాక సుం
దరమధురారవంబు నయినన్ విన నోచుకొనంగ లేదొకో?

శ్లో. నీహారాకరసారసాకరసరిత్కాసారనీరాశ్రయం
త్యక్త్వా తోయద! చాతకేన మహతీ సేవా సమాసాదితా
తస్యై తత్ఫలితం సముత్సృజసి శిలాసంతాడనం మస్తకే
గాఢం గర్జసి వజ్రి ముజ్ఝసి తటిల్లేఖాభి రాతర్జసి.

శా. నీహారాకరసారసాకరసరిన్నిరంధ్రికాసారనీ
రాహారంబును మాని చాతకము మేఘా! నిన్నె సేవింప నా
హాహా! తత్ఫలితంబు మస్తకశిలాన్యాసంబులా? గర్జిత
వ్యాహారంబుల! వజ్రిపాతముల! శంపాతర్జనాఘుంబులా!

శ్లో. సంతాపం జగతాం విలుంపసి పున ర్ధారాభి రాసించసి
క్షేత్రా ణ్యంకురయ స్యమూ న్పులకయ స్యహ్నాయ నీపద్రుమాన్
సారంగస్య నభోనివేశితదృశ శ్చంచూపుటాపూరణే
వైముఖ్యం వ్రజసి త్వ మంబుద! యది ప్రత్యేతి కో నామ తత్.

ఉ. నీపముఁ బూయఁజేయు, దవనీపరితాపముఁ బాపు, దంబుధా
రాపరిషేచనంబున ధరాస్థలి నంకురితం బొనర్చు, వే
పాపమొ కాని యాచకమువంకఁ గనంగొను చాతకమ్ముచం
చూపుటపూరణక్రియకుఁ జూడ విదేమి ఘనాఘనాగ్రణీ!

శ్లో. భో భో వారిద! వారిణా మమ ముఖం సంపూరయ ప్రేమవా
దాతా త్వం జగదేకరక్షణపరో జానాసి మా మవ్యలం
త్వా మేకం శరణాగతం సదనదీకూపేషు ముక్తస్పృహం
దీనం చాతకబాలకం నిజగృహం త్యక్త్వాంతరాళే స్థితమ్.

ఉ. దాతవు, లోకరక్షణవిధాతవు, ప్రేమమయుండ, వోయి జీ
మూత! యెఱుంగు దీవు ననుఁ బూర్ణముగా శరణార్థి దీను; నం
పీతు నొనర్పు వారి సిడి; వీడితిఁ గాంక్ష నదీనదాంధులన్
జాతకబాలుఁడన్ నిలిచినాఁడ గృహం బెడఁబాసి యున్నడన్.

శ్లో. ధీరధ్వనిభి రలం తే
నీరద! మే మా సికో గర్భః
ఉన్మదవారణబుద్ధ్యా
మధ్యేజఠరం సముచ్ఛలతి.

తే. గీ. ప్రౌఢగంభీరగర్జితార్భటుల నింకఁ
గట్టిపెట్టర! నీరదా! గజ మటంచుఁ
దలఁచి మామకజఠరమధ్యమునఁ బైకి
గంతుచున్నది మాసికగర్భ మిదియె.

శ్లో. నాయాతి చైవ భవదంబుకణాభిలాషా
త్సారంగడింభకవరోఽంబుధరా న్తికం తే
కిం తు త్వదీయఘనశాసరసత్వశాల్యా
న్నో చే న్న సంతి కతి సారసవ త్సరాంసి.

మ. అరుగుం దేరఁగ లేదు నీసరస కయ్యా! వారిదా! నీరశీ
కరకాంక్షమ్మున జాతకార్భకము; లోకంబందు లేకున్నవే
సరసీజాతవితానమానితసరోజాతమ్ము లెన్నేని, నీ
సరసత్వమ్ము ఘనత్వమున్ గనియె విస్తారమ్ము కామించెరా.

శ్లో. జలధర! భవత శ్చరితం
కి మిదం పూర్ణేఽపి పూరయసి
చిరయాచకసారంగే
పరిమితతృష్ణే న శీకరం కిరసి.

చ. చిరము సమాశ్రయించె, నొకశీకరమైనను జిమ్మ వేసిరా?
పరిమితతృష్ణచాతకమునై పునరుక్తి జలదావతంస! నీ
చరితము చిత్ర మయ్యె! యనిశమ్ముఁ బ్రపూర్ణతఁ గాంచుచోటనే
పారి పారి భూరివారిఁ బరిపూరణముం బచరింతు వెంతయున్.

శ్లో. నేత్రన్యో యది మాధవ స్తరు రయం పాథోద! పాథోలవై
రవ్యాజం పరిషించ కిం చిరయసి కాలః పరిక్రామతి
మూలే శుష్కరసే, దళే విగళితే, శుష్కే తథా వల్కలే
కస్మై దాస్యసి కో గ్రహీష్యతి పరీతాపః కథం స్థాస్యసి.

చ. జలకణవీథి మాధవకుజం బభిషిక్త మొనర్ప నెంచుచో
సలసత నీ కదేల జలదా! తగుకాల మతిక్రమించదా?
దళములు రాల, మూలమునఁ దప్ప రసంబు, నితాంతతాంతవ
ల్కలత దలిర్ప, వేరి కిడఁగాఁగల? వేరు గ్రహింతు రాపయిన్.

శ్లో. ఏతే మహాతరుణమారుతదూయమాన
దావానిలైః కబళితేషు మహీరుహేషు
అంభో న చే జ్జలద! ముంచ మహీ మిమాం భో
వజ్రం పునః క్షిపసి నిర్దయ! కస్య హేతోః.

మ. ఘనవాతాహతిధూతదావహుతభుగ్జ్వాలల్ మహీజావళిం
దనివారం గబళించుచున్ దశదిశాంతంబందు నర్తించె; జీ
వన మే నీయెడ లేనిచో విడువు మీ భాగంబు పై పెచ్చు నీ
వనుకంపారహితా! పడ న్వనరె దేలా? వజ్రముం వారిదా!

శ్లో. గ్రీష్మే భీష్మతరైః కరై ర్దినకృతా దగ్ధోఽపి య శ్చాతకః
త్వాం ధ్యాయన్ ఘనవాసరాన్ కథమపి ద్రాఘీయసో నీతవాన్
దైవా ల్లోచనగోచరేణ భవతా తస్మి న్నిదానీం యది
స్వీచక్రే కరకానిపాతనకృపా తత్కం ప్రతి బ్రూమహే.

చ. దినకరభీకరోరుకరదీధితి వేగియు నిన్ జపించుచున్
మునుకొని యెట్లొ దీర్ఘదినముల్ గడపెన్ శ్రమం బూని చాతకం
బనితరలభ్యదైవగతి నబ్బిననీవలనం గొనెన్ ఘనా
ఘన! కరకానిపాతననికామకృపం దుడ కేమనందురా!

శ్లో. ఆరామాధిపతి ర్వివేకవికలో, నూనం రసా నీరసా
వాత్యాభిః పరుషీకృతా దశదిశా, శ్చండాతపో దుస్సహః,
ఏవం ధన్వని చంపకస్య సకలే సంహారహేతా వపి
త్వం సించ న్నమృతేన తోయద! కుతోఽప్యావిష్కృతో వేధసా.

చ. మలసె మహాతపంబు, మతిమాలినవాఁ డలతోఁటమాలియున్
గలఁగె దిశల్ భృశంబు, సుడిగాడుపులన్, రస నీరసించెఁ;ద
త్ప్రళయమునందు చంపకముపై మరుభూమి జలంబు నించు నిన్
జలధర! యెందునుండి విధి చయ్యన నీవిధి బాహిరించెరా!

శ్లో. దవదహనజటాలజ్వాలజాలాహతానాం
పరిగళితలతానాం మ్లాయతాం భూరుహాణాం
అయి జలధర! శైలశ్రేణిశృంగేషు తోయం
వితరసి బహు కోఽయం శ్రీమద స్తావకీనః.

ఉ. భీమదవానలావళితవి స్తృతకీలల సోలుచున్, లతా
స్తోమము జాఱి, దైన్యగతి వోఁపఁగ భూజము లారటింపఁగా,
భూమిధరాగ్రశృంగముల భోరున నీరముఁ బూరగించు నీ
శ్రీమద మేవిధంబున వచింపఁగలాడను వారివాహనా!

శ్లో. శృణ్వన్ పురః పరుషగర్జిత మస్య హంత!
రే పాంథ! విహ్వలమనా న మనా గపి స్యాః
విశ్వార్తివారణసమర్పితజీవనోఽయం
నాకర్ణితః కిము సఖే! భవతాంబువాహః.

మ. మనమందుక్ భయ మందఁబోకుము పురోమందోగ్రగర్జార్భటీ
ఘనధాటీవికటస్వనోద్ధతి సమాకర్ణించి నుంతేనియున్
వినలేదా సఖుఁడా! సమస్తజగతీవిస్తారతాపావనో
దనకార్యార్పితనైజజీవనుఁ బయోదగ్రామణిన్ పాంథుఁడా!

శ్లో. దీనానా మిహ పరిహాయ శుష్కసస్యా
న్యౌదార్యం ప్రకటయతో మహీధరేషు
ఔన్నత్యం విపుల మవాప్య దుర్మదస్య
జ్ఞాతోఽయం జలధర! తావకో వివేకః.

తే. గీ. అమితదీనమ్ము శుష్కసస్యమ్ము వీడి
కఠినదుర్మదునౌన్నత్యగరిమ మరసి
ధరణిధరముసఁ గురియు నౌదార్యకలన
తెలిసె నోయీ పయోద! నీ తెలివికలిమి.

శ్లో. స్వార్థం ధనాని ధనికా త్ప్రతిగృహ్ణతోఽపి
స్వాస్యం భజే న్మలినతాం కి మిదం విచిత్రం
గృహ్ణన్ పరార్థ మపి వారినిధేః పయోఽపి
మేఘోఽయ మేతి సకలోఽపి చ కాళిమానమ్.

చ. "ధనికులనుండి స్వార్థపరతంత్రుఁ డనల్పధనమ్ము లందియున్
దనమొగమందుఁ బూను మలినత్వ"మనంగ విచిత్రమా! ఘనా
ఘనము వహింప నేమిటికిఁ గాళిమ మత్యధికమ్ముగా మహా
వననిధివారి సారెకు సవారిగఁ గైకొనియుం బరార్థమై.

శ్లో. కస్మై న్మహాంత ! ఫలాయ సజ్జన ! గుణగ్రామార్జనే సజ్జసి
స్వాత్మోన్నత్కరణాయ చే న్మమ వచః పథ్యం సమాకర్ణయ
యే భావా హృదయం హరంతి నితరాం శోభాభరై స్సంభృతా
స్తై రే వాస్య కలేః కలేవ రిపుషో దైనందినం వర్తనమ్.

మ. కలిలో నేఫల మూనఁ జేసి గుణ మాకాంక్షించుచున్నాడవో
వలతేనిఁ విపులాత్మసంస్కృతుల నావాక్యంబు లాలింపు, మీ
యిల శోభానిభృతంబులై హృదిఁ గరం బేభావనుల్ నాచునో
యలభావాళియె దేహపోషణకరం బౌ సర్వదా సజ్జనా !

శ్లో. కిం తీర్థం? హరిపాదపద్మభజనం; కిం రత్న? మచ్ఛా మతిః;
కిం శాస్త్రం? శ్రవణేన యస్య గళతి ద్వైతాంధకారోదయః;
కిం మిత్రం? సతతోపకారరసిక స్తత్త్వావబోధః; సఖే!
క శ్శత్రు ర్వద? ఖేదదానకుశలో దుర్వాసనాసంచయః.

చ. హరిభజనంబె తీర్థ, మమలాంతరమే మణి, ద్వైతధీతమో
హరణము దేని విన్న నగు నయ్యదె శాస్త్రము, సంతతోపకా
రరసికతత్త్వబోధనికరమ్మె సఖుం, డురుఖేదదాయి యై
వఱలెడువాసనావళియె వైరి సతంబు హితావతంసమా !

గద్యము.

ఇది హరిహరదేవదయామోదయోపలబ్ధసరసప్రౌఢకవితానుధానిధాన
భావనార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబికావేంకటరాయ
మనీషితనూజ కవికంఠీరవ, విద్వత్కవివర, కవిమూర్ధన్య,
ప్రౌఢకవిచంద్రాదిమహాబిరుదావళీవిరాజమాన,
కృష్ణశాస్త్రీనామధేయ విరచితాన్యోక్తి
ముక్తావళీప్రబంధాంధ్రీకరణమున
సర్వము సంపూర్ణము.

# ప్రాచీనకాల శిల్ప చిత్రలేఖనములు

శ్రీ విశ్వనాథ నరసింహము

(సంపుటి 47—5 సంచిక తరువాయి)

నాదగు శిల్పసౌందర్యనిర్మాణము బయలువడెను. మధ్యగోపురమును నాల్గువైపుల నాలుగుగోపురమహలులతో గూడిన ఆకట్టడము హైందవుల "పంచరత్న" దేవాలయనిర్మితికెం జెందిన కళాసృష్టి యగును.

తే. గీ. శిల్ప లందటి చాతుర్య జీవకళలు
మంజులత జిల్కు దేవినమాధియందు
అది నిశాంతదివ్యప్రేమ కాస్పదంబు
విమల విస్మృతి చిహ్నమై వెలుగు నేడు.

జుమ్మామసీదు అనబడు షాజహానుగోరీ మఱియొక శిల్పకళాసృష్టి యగును. తరువాత ఔరంగజేబు సున్నీసంప్రదాయముల విధినిషేధముల తూచా తప్పక శిల్పచిత్రనిర్మాణంబుల నిషేధించుచు శాసించెను. సంగీతకళాకోవిదుల దర్బారునుండి వెడలఁగొట్టెను. హైందవ శిల్పకార్మికుల కొనంగుజీతబత్తెము లడుగంటఁజేసి హిందూదేవాలయ వినాశమునకుఁ గడంగెను.

మొగలుసామ్రాజ్యము విచ్ఛిన్నమైనతరువాత ఆయాశిల్పులు బనారసుమున్నగు నగరముల మహారాజసౌధనిర్మాణములలో దమ నైపుణ్యమును జూపుచుండిరి. ఔరంగజేబొకనాడు మసీదునకుపోవు చుండ నొకపీనుఁగుపెట్టెను మోచుకొని కొందఱువిషాదరావములతో నాతని కెదురుపడచి సంగీతకళాధిదేవత చనిపోయిన సమాధికి గొనిపోవుచుంటిమని చెప్ప ఆదేవతను లోతుగా పాతిపెట్టుడని యతఁడు చెప్పిన యుదంతము అతని నిరసనభావమును వ్యక్త మొనరించును. మహమ్మదీయ యుగారంభమున బానిసవంశపు సుల్తాను కట్టించిన 'కుతుబ్ మినార్' నాఁబడు గోపురంబు శిల్పకళావిన్యాసశోభితమైనట్లు శాస్త్రవేత్తలు వాకొనిరి.

తే. గీ. శిల్పకళ మూర్తిమంతంబు జెందెననఁగ
'కుతుబుమీనారు' నాఁబడు గోపురంబు
డిల్లిపరిసరమందు గట్టించి పట్టి
ఘనుఁడు బానిసవంశవర్ధనుఁడు కాడె.

ఆరీతిగా నారంభమయిన శిల్పకళాభివృద్ధి షాజహానుచక్రవర్తి కాలమున జగద్విదితమయిన 'తాజ్‌మహల్' మున్నగు ననేకవిధశిల్ప నిర్మాణముల మహత్తరాభివృద్ధిఁ బొందెననియు విశదపఱచి మొగలు చిత్రలేఖనముఁగూర్చి వ్రాయుదును.

## మొగలు చిత్రలేఖనము

మొగలుచిత్రలేఖనములోఁ గొంతకొంత పారశీకచిత్రకళానిదర్శనములు కానవచ్చుచుండును. అట్టియనుకరణముల నక్బరుచక్రవర్తి హిందూదేశమునఁబ్రవేశపెట్టెను. సంపాద్యరాజ్యమును చక్కఁబఱచుకొనుటయందును నూతనరాజ్యవిస్తరణమునందును నిరంతరనిమగ్నులయినను మొగలుచక్రవర్తులు చిత్రలేఖనాదిలలితకళాపోషణమునందు మిక్కిలి మక్కువపడిరి. బేబరుచక్రవర్తి జీవితమంతయుఁ గష్టదశలఁ గడచెను. కావున కళాభివృద్ధిసాధనములంతగా నాతనికి సమకూరలేదు. అక్బరు కాలమునాటికి దేశమున శాంతి నెలకొనుటచే నన్నివిధములగులలితకళలు నా కాలమున నభివృద్ధి నందెనని నిశ్చయింపవచ్చును. ఆచక్రవర్తికి చిత్రలేఖనమునం దభిలాష మెండుగా నుండెనని అబుల్‌ఫజల్ వ్రాసియున్నాడు. రాజాదరణ ముండినందున హైందవచిత్రకారులేకాక ననేకులగు విదేశీయచిత్రకారులు కూడ నచటికరుదెంచి తమప్రావీణ్యమును చాటించుచుండిరి. "సదాశ్రయేన శోభంతే పండితావనితాలతా" అను నార్యోక్తి సార్థకము నాకాలమునఁ జెందెను. హిందూమహమ్మదీయభేదము నెంచక కళాకోవిదులగువారికి వేతనము లొసంగి యాతఁడు పోషించెను. వారమునకొక

సారి చక్రవర్తి స్వయముగా వారివారి రచనలఁ బరీక్షించి బహుమతుల నొసంగుచుండెను. మహమ్మదీయమతగ్రంథముల నలంకరించుటకు భారతచిత్రకారుల నక్బరు నియమించుటవలనఁ బారశీకవిధానములందు సనాతనహైందవసంప్రదాయములు సమ్మిశ్రితములుచేయఁబడి నూతన చిత్రము లేర్పడి అందఱకు నాకర్షణీయము లయ్యెను. ఆపద్ధతులు తరువాత చిత్రకారు లందఱు నవలంబించిరి.

పారశీకచిత్రరచన మొదట మొగలుదర్బారులలో నాదరము నొంది హైందవకళాసమ్మేళనము నొందియొక నూతనవిధానమయ్యెను. ఆమిశ్రకళ తరువాత ధనికులగు నుద్యోగులయిండ్లయందు వెలసినది. క్రమముగా నయ్యది రూపచిత్రముల రూపమును వహించి జనసామాన్యమునఁ గొంతదనుక వ్యాపించెను. గాఢమగు వర్ణములు హిందూ చిత్రకారులచేతులలో తేలికరంగులుగా నతిసాంద్రములై కనుల కింపు నింపునట్లు లావణ్యమును వహించుఁ జిత్తరువులుగా మార్పుఁజెందెను. చక్రవర్తుల మృగయావినోదములు, దేవతోత్సవములు, సాంఘికజీవనము, రాజకీయములగు నితరరంగములు, ఎంతటిపెద్దచిత్రమయినను చిన్నతావున నన్నియు నిరవొందురీతిగా వ్రాయుట మొగలుచిత్తరువుల విశేషముగా నుండెను. చక్రవర్తుల యాదరణమునుబట్టి మొగలు చిత్తరువులు ఇతరసంస్థానాధీశుల సమాదరము నొందెను.

దేశీయుల యభిరుచు లటనట మార్పుసహించుచుండుట సహజమయినందున 'ఢిల్లీకలము' 'జయపూరుకలము' లక్నోదక్కాణము మొదలగు రచనావిధానము లన్నియుఁ గొన్ని యంతర్భేదములుగా నుండెను. చిత్రకళను ప్రోత్సాహ మొసర్చుటలో అక్బరునుమించినవాఁడాతని కొమరుఁడు జహంగీరు. ఆతఁడు తనవద్ద నున్న చిత్రకారుల చిత్తరువులఁ జూచి యపరిమితానందమును పొందుచు దానే వారినందఱఁ బోషించుచున్నందులకు కించిత్తు గర్వించెడివాఁడు.

మృగయావినోదవిహారములఁ గూర్చియు అరణ్యమృగచిత్రాకారంబులును నాటిచిత్రకారులు హెచ్చుగాఁ జిత్రించుచుండిరి. బసవన్, జస్వంత్ మున్నగు సుప్రసిద్ధులు చిత్రరచన మొనర్చినను వారి చిత్తరువులలో స్వేచ్ఛాభావన చేసికొను స్వాతంత్ర్యము లేమిచే నా చిత్తరువు లంత భావస్ఫోరకములు గావు. ఇస్లాముమతగ్రంథములలో స్వర్గమర్త్యలోకములయందలి యెట్టిరూపమునైనను చిత్రకారులు తమ చాతుర్యము వినియోగించి రచింపరాదను నిషేధముండుటచే ఆయా చిత్రకారు లెంతటిప్రతిభావంతులైనను వారికిఁ దగిన స్వాతంత్ర్యము లేకయుండెను. ఆనిషేధమును కొందఱు పాటించినను మఱికొందఱు కొన్నిసమయములలో నతిక్రమించిన నిదర్శనములు కాననగును. మహమ్మదుప్రవక్త కల్లుఁడైన 'ఆలీ' యొక్కయు ఆతని సతి 'ఫతీమా' యొక్కయు చిత్రరూపములు మసీదులకుడ్యములపై వ్రాయఁబడినట్లు తెలియుచున్నది. పియామహమ్మదీయులు మతనిషేధము నంతగా లెక్కింపనివారగుటచే పారశీకములో నెక్కువగాఁ జిత్రకారులు వృద్ధి నొందు దోహదము లేర్పడెను. మొగలుచక్రవర్తులుగూడ రానురాను నియమావళి నంతగా నరకుసేయక తమదర్బారుమహాలుల నలంకరించు నిమిత్తము పారశీకుల నుదాహరణముగా స్వీకరించియుండిరి. చిత్రనిర్మాణములఁ జేయునపుడు జీవకళనం దమరించుటకు శక్తుఁడుకామి సట్టిప్రతిభావిశేషమును నిరంతరముగా నీశ్వరధ్యాన మొనరించుటవలననే కలుగుననియు తన్మూలమునఁ జిత్రకారులు విజ్ఞానవంతు లగుదురనియును అక్బరుచక్రవర్తి యభిప్రాయము. షాజహానుచక్రవర్తి పుత్రులలో నొకఁడు దారాషుకోషు అనువాఁడు గృహచ్ఛిద్రములవలన గలిగిన సమరమునం దోటువడి పలాయితుఁ డగుచుండ మధ్యేమార్గంబున నాతని సతీమణి మిక్కుటముగా డప్పిగొని నీరము లెచ్చోటను లభింపమిచేఁ బ్రాణముల వదలెను. అట్టిదుఃఖవార్తకు సంతాపము నొందిన

చక్రవర్తికుమారుఁడు చిత్రసంపుటము నొండు సమకూర్చి ఆమె కంకిత మిచ్చెను. దారాషుకోషు చిత్రసంపుటమని యయ్యది ప్రసిద్ధమయ్యెను.

ఆ కాలమునందు హైందవసంప్రదాయమున ననుసరించి కుడ్యచిత్రములు నిర్మించు నలవాటు కొనసాగుచుండెను. ఫతేపూరుసిక్రీయందలి అక్బరుచక్రవర్తి శయనమందిరమునందు 'కుడ్యచిత్రములు' కలవు. ఆతని హిందూసతియగు మేరియముజ్జామనునామె మందిరకుడ్యభాగంబులు కోమలరూపములతో నలరారు చిత్రకళావిన్యాసంబులు కల్గియుండెను. చిత్రసంపుటములందును మతగ్రంథాదుల చిత్రలేఖనములందును ఎన్నెన్ని చిత్రములు కానవచ్చుచున్నవో కుడ్యాలంకారములగు చిత్తరువులంగూడ నన్నిరకములు కాన్పించుచున్నవి. రెక్కలుగల్గిన దేవదూతలచిత్రము లిందు గానవచ్చుటచే నప్పటికే ఆచిత్రకారులు పాశ్చాత్యపద్ధతులఁ దెలిసికొనిరని వ్యక్తమగును. అక్బ రన్నిమతముల నాదరించెననుట ఇందువలనగూడ విస్పష్టము.

మొగలుచిత్రములు ప్రపంచవిషయముల నన్నింటిగూర్చియుఁ దెలుపుచున్నవి. కాని ఇస్లామునకు విరుద్ధమగు విగ్రహారాధనమును గూర్చిన చిత్తరువులుమాత్రము లేవు. మతవిషయికచిత్రముల నాకాలమున జూడకున్నను అచ్చటచ్చట హైందవబౌద్ధకైస్తవమతములచిత్తరువులు కొలఁదిగ జూపట్టును. మహమ్మదీయయువతులు 'ఘోషా' పద్ధతి నవలంబించుటయు నాటి హైందవులలోకూడ నట్టియాచారముండుటచే నాచిత్తరువులలో సాంసారికములగు చిత్రములు హెచ్చుగాఁ గానుపింపవు. అయినను మహమ్మదీయులు భోగలాలసులగుటచేఁ గొన్ని స్త్రీరూపచిత్రణములను స్త్రీపురుషరూపసమ్మిశ్రితచిత్రములను మనచిత్రకారులు నిర్మించునవకాశము గల్గినది. రాజకీయములఁ జూపు చిత్రములలో ఢిల్లీలోని గొప్పపండుగులకుఁ జెందిన విశేషము లనేకములు కాన్పించును. జహంగీరుకాలమున పర్షియాదేశమునుండి యిచట కరు

దెంచిన రాయబారులకు స్వాగతం బిచ్చినవిషయ మొకచిత్తరువునఁ జూడగలము. షాజహాను జన్మదినోత్సవమును సల్పినటు లాయాసమయములందు వివిధదృశ్యములు మఱియొక చిత్రరచనలోఁ గనఁగును. షాజహాను జననీస్తన్యము గ్రోలుచు నామె యంకమునం దున్నట్లురచింపఁబడిన చిత్తరువు మిక్కిలి చక్కని దృశ్యము. షాజహాను నెమలిసింహాసన మలంకరించుట, యమునానదీసైకతముల సైనికపరీక్షలఁ జేయుట మొదలగు చిత్రములెన్నియో నాటిరాజకీయాదులు తెల్పునవి మనకు లభ్యములు. జహంగీరు గురువునొద్ద విద్యాభ్యాస మొనర్చుచిత్తరువు సహజవిలాసభాసురంబయి గురుశిష్యుల యాకృతులు, గ్రంథములు, ప్రక్కనున్న తివాచిపై నిదురించుపిల్లియుఁగూడ జిత్రరచనాకౌశలమును వెల్లడించును. అక్బరుచక్రవర్తి తనరూపనిర్మాణ మొనరింపుమని తానే చిత్రకారునెదుట గూరుచుండెననియు, జిత్రకారుఁ డాతనిలావణ్యవిన్యాసములనెల్ల చిత్తరువున నచ్చొత్తించి రచనగావించెననియు తెలియుచుండుటచే నాతఁడు రూపనిర్మాణమును ప్రోత్సహించెనని వ్యక్త మగును. మఱియు నక్బరుచక్రవర్తి తనయుద్యోగుల నందఱిని రూపచిత్రముల వ్రాయించుకొనుటకుఁ బ్రోత్సహించెననియు నట్టిరూపచిత్రములనన్నింటిని చిత్రసంపుటముగా సమకూర్చుటచే నందు మృతులైనవారుకూడ నమృతులుగా నున్నారనియు అబుల్ ఫజిల్ 'అయినీఅక్బరీ'అను గ్రంథమునఁ జేర్కొనెను.

మఱియు చిత్రములకునలువైపుల చట్రములవలె తీరుగుల్కులతాదులఁ జిత్రించుట నాటిచిత్రకారులలో నలవాటుగా నుండెను. కోరక ప్రశవగుళుచ్ఛంబులనెల్ల నతిమనోహరముగా వివిధవర్ణముల విన్యాసములతో వారు చిత్రించుచుండిరి. కొన్నింటియందుఁ జిన్నచిన్న వికిరరూపంబులును సీతాకోకచిలుకలునుగూడఁ గన్పట్టును. మొగలుచిత్తరువులందలి యాకారములలో నత్యంతసూక్ష్మవివరములు కూడఁ గన్పించు

నట్లు వ్రాయుటచే గొన్నింటిని దుర్భిణీయంత్రసాహాయ్యమునఁ జూడవలసియున్నది. ఆకాలమున రంగుల నుపయోగించుటకంటె రేఖలతో రూపచిత్ర మొనరించుట విశిష్టరచనగా నెంచఁబడెను. ఆరితేరిన చిత్రకారులు రేఖాచిత్రరచన సాగించి వారిశిష్యులకు రంగుపూతనిమిత్త మిచ్చుచుండినట్లు తెలియుటచే రేఖానిర్మాణకౌశలమే హెచ్చుగానెన్నఁబడినట్లు విశదమగును. అపుడు కొన్ని చిత్రరూపముల ముదుకబట్టల మీఁది నానారంగులతోఁ జిత్రించు నైరోపీయపద్ధతు లనుకరింపబడినట్లు తెలియుచున్నది.

షాజహాను కాలమున చిత్రలేఖనముకంటె శిల్పమే హెచ్చుగా వృద్ధినొందెను. అందుల కాతనికి కట్టడముల నిర్మింపఁజేయుటలో గల గాఢాభిమానమే కారణ మగుచున్నది. తరువాత జహంగీరుకాలమునఁ జిత్రరచన మిక్కిలి పెంపునొంది మరల క్షీణించెననియు నపుడు శిల్పకళాభివృద్ధి హెచ్చెననియు నూహింపనగును. శిల్పచిత్రలేఖనములు రెండింటిలోఁ గాలయమునికి సులభగ్రాహ్యములుగాఁ జిత్రరచనలుండుటచే నాకాలదోషమునఁ జేసి చిత్తరువులయం దప్పటిరచన, నాటితళుకుబెళుకులు నిల్చియుండుట సాధ్యము కాదని మనమట్టి కాలప్రమాదజనితదోషములకుఁ దగిన తావొసంగుచు నాయాకళారహస్యములఁ దెలియవలయును.

## స్త్రీలు చిత్రకళ

వివిధకళోపాసకుల కవలంబనముగను సృష్టిస్థితిలయములకునాధారభూతముగా నెంచఁబడు నాదిశక్తి యపరావతారములుగా నార్యయుగమునుండియు వేదవేదాంగములలోఁ బ్రస్తుతికెక్కిన లలనాజనంబులు, లలితకళలను అందు శిల్పచిత్రలేఖనములకు నెంతగా నాధారమైరో నిదర్శనములవలన నుదాహరించెదను. హరివంశమునందలి యుషాపరిణ

యము సుప్రసిద్ధము. అందు బాణాసురుని కొమరితె యుషాకన్య, దేవీ ప్రసాదమునంది యర్చనాపమయమున నద్దేవి వైశాఖశుద్ధద్వాదశినాటి రేయి హర్మ్యతలంబున నిద్రాముద్రితయైన యామెను నిజతల్పంబున ననఘశరీరుం డగుపురుషాగ్రణియొక్కరుఁడు తియ్యనిపలుకుల నానందింపఁజేసి బిగియార కౌఁగిటం బెనంగి చతురరతులవితతముల నాత్మమూర్తి యారమణీమణి తలంపున నెలకొనునట్లు చేయువాఁడామె వరుఁడగు నని యానతిచ్చె. నిర్దిష్టదివసంబున నర్ధనిశీథమందు హర్మ్యతలంబున నామె నిద్రించియున్నంత నొక మనోహరాకారునితోడి సంభోగసౌఖ్య మనుభవించెను. ఎఱుకగల్గినంత నామె విలపింపఁదొడంగిన చెలికత్తె యగు చిత్రరేఖ యామె నూరడించి దేవీప్రసాదవాక్యంబులస్మృతికిఁదెచ్చెను. ఉషారమణిని స్వప్నమున సంగమసౌఖ్యమున నలరింపఁజేసిన వ్యక్తిని దెలియుట కెట్టియవకాశమును లేదు. మనసులో నెనసిన సుందరమూర్తి యాకారచేష్టితసరసత్వంబుల ననుభవించి మిక్కిలి చొక్కునొందిన యుషాదేవి యాతఁడెవ్వఁడో చెప్పజాలదయ్యె.

అంతఁ జిత్రరేఖ- యోగవిద్యావిదితయైన మహానుభావురాలు- తానొక మార్గమును చూపినది. చిత్రనిర్మాణమునకు పలయువర్ణంబుల నేకరించినది. తూలిక నొవ్వుగా ధరించి పదునాలుగుభువనంబుల విదిత రూపయావనోద్భాసితులగు వయసుకాండ్రఁ బ్రఖ్యాతులగు వారిని వారి యాకారముల నంబరాభరణాదులతోడను హావభావలాలిత్యములతోడను సప్తరాత్రంబులలో వ్రాసి తెచ్చి నెచ్చెలి యుషాసుందరిముందటఁ జూపి వారినెల్ల వేరువేరుగా నిరూపించి చెప్పెను. ఉషాసుందరి యప్పుడు 'నీకౌశలమేమని కొనియాడుదుఁ జెలియా' యని హృదయానందమును వెలిపుచ్చినది. అట్టియానంద మామెయే కాక యాకథాశ్రవణమున మనముకూడ జిత్రరేఖ చిత్రకళాకౌశలముఁ గొనియాడకుందుమా? అట్టిచిత్రకళాకౌశలాదులు చిత్రరేఖకు యోగవిద్యామహత్త్వమువలన

తిపురరాజకుటుంబమునకుఁ జెందినవాఁడు. బాల్యమునుండియు చిత్రరచనాభిరుచిగలవాఁడై కొందఱు కొందఱు చిత్రకారులయొద్ద తైలవర్ణలేపనమును నేర్చుకొనెను. ఆయాంగ్లసంప్రదాయమును నెక్కువగా నభివృద్ధి నొందించెను. అంద ఱాతని చిత్తరువు లామోదించిరి. ఐరోపీయు లాతని మెచ్చుకొనిరి. రవివర్మయు తనప్రయత్నముల దృఢముగ సాగించి చిత్రకారులలో మేటి యయ్యెను. రాజపుత్ర మొగలుచిత్రములు క్షీణదశను వహించిన యాకాలమున రవివర్మ పురాణకథలు చిత్రరచనలందు జూపింప, మత సంప్రదాయముల మమకారము గొనిన హైందవులు వర్మగారి చిత్తరువుల నామోదించి స్వీకరించుచుండిరి. అచ్చొత్తింపఁబడిన వీరిచిత్రములు మిగుల ప్రచార మొందినవి. రవివర్మ యాతని చిత్రములందు పాశ్చాత్యవ్యామోహమున భారతీయవ్యక్తిత్వమును చరిత్రను గూడ పాటింపలేదు. ఆతని దమయంతిచిత్తరువులందలి భవనములు పాశ్చాత్యనిర్మాణములే కాని హైందవసంప్రదాయమున గనరావు. హైందవసాహిత్యమునం దుత్ప్రేక్షలవలెనే చిత్రరచనలలో భావనాశక్తి హెచ్చుగా నుండవలెను. అట్టి సంప్రదాయముల నాతఁడు పాటింపలేదు. అతని కృష్ణరాయబారము మున్నగు చిత్తరువులు చాల మనోజ్ఞములు. రవివర్మ వ్రాసిన రూపచిత్రములు చాల మనోజ్ఞములైనను అవి యచ్చొత్తింపఁబడి ప్రచారము నొందలేదు. అతని శిష్యులు కొందఱుచిత్రకారులు పూర్వ రాజపుత్రయుగచిత్రరచనా సంప్రదాయముల నవలంబించుట శుభచిహ్నము. బంగాళమున రూపచిత్రములు వ్రాయువా రనేకు లున్నను హెచ్చుగఁ బ్రసిద్ధినందినవారు కనరారు.

మఱల భారతీయవ్యక్తిత్వమును చిత్రకళలో నభివృద్ధి చేయవలె ననువారలలో అవనీంద్రనాథ ఠాకూరు ముఖ్యుఁడు. అతఁడుకూడ నూనె రంగులతో మొదట చిత్రరచన మొనరించి తరువాత సంప్రదాయవిరుద్ధ

మని మానుకొనెను. కలకత్తాచిత్రకళాశాలయం దాచార్యుఁ డైన హేవెల్ పండితుఁ డావిధానములు- నీటిరంగులతో వ్రాయుహైందవసం ప్రదాయముల దనకళాశాలయందు జొప్పడఁజేసెను. ఈయుగమునందు జాతీయోద్యమములు బయలుదేరి హైందవసంస్కృతి యను నాందోళ నము హెచ్చినది. తత్కారణమున హైందవసంప్రదాయముల నర్థము చేసికోవలెననియు లలితకళ లావిధముగ దోహద మొనర్పవలెననియుఁ గొంద ఱానక్తి వహించిరి. అజంతాచిత్రరహస్యముల నవగాహన మొన ర్చుకొను నధికప్రియాసమును కొందఱు వహించిరి. మఱియు ప్రమోద కుమారఘటోపాధ్యాయుని రప్పించి జాతీయచిత్రరచన నెలకొల్పఁబ్రయ త్నించిరి. తత్పరిణామముగ నాంధ్రజాతీయకళాశాలలో గొందఱు చిత్రకారులు బయలుదేరిరి. కాని వారికి వంగసంప్రదాయములు హెచ్చుగ నలవడినవి.

అట్టిప్రయత్నములు తొలుత నాంధ్రచిత్రకారుఁడైన దామెర్ల రామారావు చేసిరి. తొలుత ఠాకురువలె వీరును పాశ్చాత్యపద్ధతు లవలంబించి త్వరితకాలమున హైందవకళావైశిష్ట్యమును సులభముగా నెఱింగిరి. అజంతాచిత్రరువులలోని లోపముల సవరించి యాంధ్రజాత్య భిరుచుల ననుసరించు కళాసంస్థను నెలకొల్పవలెనని వారి యుద్దేశము. ఆంధ్రదేశమున దామెర్ల రామారావు బొంబాయి, కలకత్తా, చిత్ర కళావిధానముల లోపములు సవరించునూహతో నూతనరీతిని ప్రచార మొనర్చిరి. అల్పాయుష్కు లగుటచే వారిరచనావిధానము పాదుకొనక ముందే వారు దివంగతు లైరి. పాశ్చాత్యవిధానముల వీడిన యాంధ్ర చిత్రకారులు వంగవిధానమునకు దాసులై యాంధ్రత్వమును వీడరా దని రామారావుగారిరచనావిధాన మెన్ని యోవిధముల సహకరించును. అందువలన నాఁటేఁడు చిరకాలయశశ్శరీరమున నాంధ్రులలో గలసిమెలసి యుండును.

తులసీపూజ యొనర్చుట మతియొక యాచారము. మాఘమాసమున సూర్యార్చన మనేకవిధముల జరుగును. అందు తులసియొద్ద ముగ్గులుపెట్టి యలంకరింతురు. వివిధపద్మాకారములు, రంగురంగుల విలసిల్లును. అందు భక్తిశ్రద్ధలు కనవచ్చుటయుఁ జిత్రరచనాకౌశలము చెన్నువహించుటయు నేకకాలమున గోచరించును. కేవలహస్తమాత్ర సాహాయ్యమున మాహాశక్తి ననుసరించి చిత్రవిచిత్రము లగు రచనా విధానములఁ జూపుసంప్రదాయము, భగవద్భక్తిపూరితముగా నర్చించునాచారము హైందవసుందరీమణులయందే కాన్పించునుకాని పాశ్చాత్యులలో నెచ్చటను మచ్చునకేనియు లేదు.

ఆసేతుశీతాచలపర్యంతమును గణాధ్యక్షు నర్చించుట హిందువుల సంప్రదాయము. గణపతిపూజకై ఆయాకారనిర్మాణము అవశ్యమగుచు తదీయమృత్తిరూపముల నిర్మాణము హైందవస్త్రీలశిల్పరచనావిన్యాస మగును. ప్రాచీనకాలమునందును ఆగణపతిదేవుని శిలానిర్మాణములు తదర్చనాదులును విశదవిషయములు. మనదేశములోని గణపతినవరాత్రోత్సవములలో సామాన్యమగు మృత్తికానిర్మాణమున దేవు నర్చింతురు. లోహనిర్మాణములును వెండిబంగారువిగ్రహములును కూడ నావినాయనకుఁ జేయించి బహుళగతుల నర్చించుట యాచారము. పురాణప్రసిద్ధముగ గణపతి శిల్పరచన గజముఖాదులతో నిర్మింపఁబడుచున్నది.

ఆరీతిగనే సరస్వతీపూజాదికము లొనర్చు సందర్భములుకూడ సంప్రదాయముగా నున్నవి. సరస్వతీవిగ్రహము మృత్తికాదులనిర్మించి వివిధాలంకారములతోడను వీణాదివాద్యవిశేషములతోడను నిర్మించి యర్చించు టాచారము. కొందఱు చిత్రకారులా దేవీమూర్తికి నాల్గు చేతులు నిర్మాణించిరి. ముఖ్యముగా నద్దేవి సంగీతసాహిత్యాదిసమస్త విద్యలకు నధిదేవతగాఁ బరిగణింపఁబడి యారాధింపఁబడుచున్నది.

మఱియు రిప్పిబొమ్మల నిర్మించుట కనుపించును. మట్టిబొమ్మలు పంటచేలకు చూపరుల దృష్టిదోషనివారణార్థముగా నమర్పబడును. అందనేక విధులు గలవు. స్త్రీలు వానియందు రచనాకౌశలము చూపు చుండిరని తెలియుచున్నది. ధూర్జటిమహాకవి కాళహస్తిమాహాత్మ్య మున భిల్లాంగనల శిల్పరచన వెఱ్ఱిబొమ్మల నిర్మించుటలో వివరించెను. అగురుత్వాన్మరుహకాష్ఠఖండముల సర్వాంగంబులం జేసి, శరీరమునకు మృగ మదముతో నల్లగా మసివంటి పూఁతఁ బూసి, చమరీమృగవాలమును ధమ్మిల్లమ్ముగా నొనరించి యేనుఁగుకుంభమ్ములలో నేరిన ముత్యము లతోఁ గన్గ్రుడ్లను నిర్మించి వెఱ్ఱిబొమ్మల భిల్లాంగన లొనర్చిరి.

## ఆ ధు ని క యు గ ము

ఆధునికకాలమున నాంగ్లపరిపాలనము ప్రారంభమైనదాదిగ నాయానాగరికలాంఛనములు మనదేశమునఁ బ్రబలుటయు నందువలన లలితకళాభివృద్ధిలోఁగూడ పాశ్చాత్యసంప్రదాయముల ప్రాబల్యము కను పించుటయు విశదమగుచున్నది. సంగీతసాహిత్యములందేమి, శిల్పచిత్ర లేఖనములందేమి నవీనయుగమున నాంగ్లసంప్రదాయములును తక్కటి పాశ్చాత్యసంప్రదాయములును చాలప్రోద్బలమువహించి మనకళలలో గొన్నిమార్పులఁ దెచ్చినవి. పరాను దేశవాద్యవిశేషమగు ఫిడేలు మున్నగు సంగీతసాధనముల వాడుక ప్రబలినది. సాహిత్యములో షేక్స్పి యరు మున్నగు నాంగ్లకవీంద్రుల విషాదాంతనాటకచిహ్నములును స్కాట్టు మొదలగు నవలారచయితల వచనరచనావిధానములును హైం దవసాహిత్యములలోఁ బొడమూపినవి. శిల్పచిత్రనిర్మాణములందును పాశ్చాత్యుల జాడలు మనకళోపాసకుల నెక్కువ ప్రోద్బల మొన రించెను.

సుప్రసిద్ధచిత్రకారుఁ డగు రాజా రవివర్మ హైందవచిత్రలేఖన మున మొదట ఆంగ్లసంప్రదాయములఁ జొప్పించెను. అతఁడు తిరువనం

జూపుచుందురు. ఇందలి కళావిన్యాసము కనులపండువుగా నుండును. ఇది యాస్త్రీలు గురువునొద్దకాని కళాలయములలోగాని నేర్చుకొనిన విద్యావిశేషము కానేరదు. సంప్రదాయముగా స్త్రీలలవఱచుకొనిన కళాసృష్టి.

మఱియు హైందవనారీమణులలో సహజకళావిన్యాసములు కాన్పించును. వస్త్రధారణమున నాజూకును చీరెలరంగుల నెన్నుటలో గల యూహాశక్తియు నాభరణముల సమర్చుకొనుటలోని యందచంద ములును ప్రాచీనార్వాచీనకాలములం దెవ్వకును శిల్పచిత్రకళావిన్యాస శోభితంబులు. కొంచెమెఱుపుగల శరీరచ్ఛాయగలవారు అచ్చపుశ్వేత వసనంబులు చుట్టుచుగలవి ధరించి శోభలు వెదజల్లుదురు. ఎఱుపును మించిన తెలుపురంగుగల సుందరీమణులు చెంగావిచీరెల ధరించి సౌం దర్యవిరాజిత లగుదురు. శ్యామలకోమలాంగులు దట్టమగు రంగులు గలబట్టలు కట్టుట కుత్సహింతురు. కంచుకకాంతికిని వస్త్రాచ్ఛాదనము నకు నెట్టిఛాయాభేదము లుండవలెనో వారెంచుటయందుఁ గళాసృష్టి కానవచ్చును. కర్ణాభరణములును కంఠాభరణములునుకూడ వారు కళాదృష్టితో నెంచుకొందురు. సామాన్యముగా చామనచాయగలవా రికి తెల్లరాళ్లు- వజ్రపుపొడిగల కమ్మలపై నామోదము కల్గుచుండును. వారిశరీరచ్ఛాయ నీకమ్మలకాంతి ప్రస్ఫుటముగా నుండవలెనని వారి యూహ. మఱి శ్వేతచ్ఛాయాన్విత సౌందర్యభాసమానలకు రత్నకాం తులమెఱుగిడసముపై మోదము. వారట్టి కర్ణాభరణముల నెన్నుదురు. బులాకీమున్నగు నాభరణముల నమరించుకొనుటలోగూడ వారికి సహజ సౌందర్యలాలసత్వమును తత్పరిపూరణాభిలాషయుఁ గాన్పించును. వివిధ ములగు జరీసరిగిపేలఁ గూడ వివిధకళాభిలాషలతో వార లెన్నుకొను చున్నారు.

మఱియు సహజశోభావిలాసములగు శిరోజములఁ బోషించుకొనుటలో వారి కత్యంతాసక్తి యుండుట విశదము. కొందఱు నిడుపైన శిరోజములు కలవారు వాలుజడలు వేసికొనిన మఱికొందఱు కీలుగంటును నైచికొందురు. పూలమాల ధరించుటయుం దనేక విధములగు చిత్రరచనాకౌశలములు చెలువారును. హైందవసుందరీమణుల రచనావిశేషములు చిత్రరచనాదులందు సహజశోభితము లగుననుట వారినిత్యకృత్యములందుఁ గోచరించును. అందుముఖ్యముగా రంగవల్లుల రచనారామణీయకత స్తుతిపాత్రము. బలిహరణమనుపేరఁ బూర్వసంప్రదాయమున ముంగిట కలయంపి చల్లిన సూక్ష్మజంతువులు నమసిపోవుననియు అదురితనివారణముకొఱకు బియ్యపుపిండిని ముగ్గులువెట్టి మఱియితర సూక్ష్మజీవుల కాహారము గల్పించవలెననియు వారి యాచారము. గోమయమిళితజలంబుల గృహాంగణముల శుభ్రపఱచినవెనక ప్రాతఃకాలమున ముగ్గులుపెట్టుట సంప్రదాయము. ఇందు వివిధములగు నాచారములున్నవి. కార్తికమాసము మొదలు ముగ్గుల మురిపెము మిక్కిలి యెక్కువగును. నారీమణులు ముంగిట జలక్షాళనాదులైన తరువాత చిత్రవిచిత్రముల ముగ్గు లిడుదురు. అందు వివిధ వృక్షాకారములు, జంతువుల యాకృతులు, గృహారామాదివిలసనంబులు, పద్మాకారములును, తదితర రచనావిశేషములును అనేకవిధముల నయనానందకర మగును. అందుముఖ్యముగాఁ బద్మములనేకవిధచిత్రరచనాసౌందర్యముల నలరారుచుండును. అన్నింట నెన్నందగునది సహస్రదళపద్మాకారము. గృహములు, గృహద్వారములు, ద్వారద్వయసమన్వితములు, ద్వారచతుష్టయము, ద్వాదశద్వారసౌధములు మున్నగునవి మిగుల రమణీయములు. జంతువుల గజాకృతిసాగసుగులుఁ గను. గృహద్వారంబుల కిరుపార్శ్వంబుల నేన్గులఁ గొందఱు చిత్రింతురు. సంక్రాంతిముగ్గులు మకరసంక్రమణమునకు నెలరోజులు ముందుగ నారంభింపఁబడి క్రమక్రమాభివృద్ధినొందుచు సంక్రాంతినాటికి సర్వవిధసంపూర్ణ సౌందర్యము నొందును.

గల్గినవని చెప్పఁబడినది. లలితకళలకు పూర్వజన్మసంస్కారాదులును ప్రస్తుతజీవితమునగూడ దేవతోపాసనాదికములును అవశ్యములని నేడును దలంతురు.

మఱి ప్రభావతీ ప్రద్యుమ్నము సూరనసృష్టి. అందు మొదట చిత్రఫలకవృత్తాంత మొండు బయల్వెడలినది. చిత్రఫలక మగజచేతనే ప్రభావతి కీయఁబడినది. ఆచిత్రరూపము దిలకించునపుడు-

"కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్క మ చూచినట్లు తోఁ
బలుకఁ గడంగినట్లు గడు భావగభీరత లబ్బినట్లు పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁదలంకెను తాను బోటియున్."

అని యిందు కవీంద్రుఁడు చిత్రరూప మెట్లుండవలెనో చెప్పినాఁడు. కల కలమని నవ్వినట్లా చిత్తరువులోని రూప మున్నదఁట. ముఖవికాసము నందలి సౌందర్య మాదుమూలమునఁ ద్యోతకమగును. తెలికన్నుల నిక్కమ చూచిన ట్లున్నదనుటలో నేత్రములు తేజోవంతములై యుండెననియు, నేత్రము లమరించుటలోననే చిత్రకళాకౌశలమంతయు నిమిడి యుండుననియు వ్యంగ్యము.

తోడుతోడనే చిత్రరూపమున పురుషుఁడు పలుకుటకు సంసిద్ధుఁడైనట్లు చెప్పఁబడినది. అనఁగా నించుక పెదవులఁ గదలించినరీతి యూహింపనగును. తరువాత భావగంభీర్యము నాపాదించి కవి యొక్క ముఖ్యవిషయమును వాకొనెను. జీవకళ యుట్టిపడ వ్రాసిన చెలువమని పేర్కొనెను. జీవకళ తొణికిసలాడునట్లు చిత్తరువు లుండవలెనని యిం దువలనఁ దెలియువిషయము. ఇది చిత్రకళాసౌందర్యమునకే కాక శిల్పాదులకుగూడ ముఖ్యలక్షణము. జీవకళతో నొప్పారు శిల్పచిత్ర రూపములే ప్రశస్తములుగా నెంచఁబడును. సూరనార్యుఁ డిందు మన కనులయెదుట నాచిత్రరూప మున్నట్లు సజీవమగు కవితాశిల్పమునఁ జూపెను.

సంస్కృతకవులలో భవభూతిమహాకవి విశిష్టదృశ్యకావ్యమగు నుత్తరరామచరితంబునఁ జిత్రపటసందర్శనమును ప్రథమాంకమునఁ వివరించెను. అనఁగా రామాయణకాలములోఁగూడ చిత్రకారుల రాజచంద్రులు పోషించుచుండిరనియు నాచిత్రసందర్శనంబున జానకీదేవియానందించినట్లును తెలియుచున్నది. శ్రీరాముని యాదరామోదములకొఱకు చిత్రకారుఁ డాతని గతజీవితవృత్తాంతములనే- బాల్యాదికములు, అరణ్యవాసము, పరశురామగర్వభంగము- చిత్రించినట్లు తెలియుచున్నది. ఇందువలనఁ జిత్రవిద్య మనహిందూదేశములో నెంతప్రాచీనకాలము నుండి యభ్యసింపఁబడుచుండెనో, రాజపోషణము నెట్లుపొందుచుండెనో తెలియుచున్నది.

సంపన్నగృహస్థుల స్త్రీలు దీపారాధన మొనరించు నలవాటు హిందూదేశమంతటను కాన్పించుచున్నది. దీనికి ప్రాతిపదిక సూర్యోపాసనము. సూర్యభగవానుఁడు ప్రత్యక్షదైవమని ఆతని నారాధించుట సంప్రదాయసిద్ధముగా నున్నది. సూర్యోపాసనకు రక్తవర్ణపుష్పములు ముఖ్యములు. అక్షతలుకూడ కుంకుమచందనముతో గలిపి సూర్యునర్పింతురు. దీపావళినాఁటకు నుత్సవము మనదేశ మంతటను కానఁపించును. ఉత్తరహిందూస్థానమున మఱింత యుజ్జ్వలముగా స్త్రీలు సూర్యోపాసనఁ జేయుదురు. ఎల్లరును గృహాంగణప్రదేశమును శుభ్రపఱచి సాయంసమయమున దీపారాధన మొనరింతురు. జొన్నలను పిసిన పిండితో జేయఁబడిన చిన్నగుంటవులమధ్య నొకవత్తి నిడి యందు నేయి వోసి దీపముల వెలుగింతురు. కొందఱు ప్రమిదలలో దీపములఁ బెట్టుదురు. కొన్ని చిన్నచిన్న దీపముల సమూహముగా నలుచదరముగాను వలయాకారముగాను పెట్టినతరువాత సరిగా వానిమధ్యమున నొకపెద్ద దీపమును పెట్టెదరు. దీపముల పేర్పులలోను మార్పులలోను అనేకభేదము లుండును. ప్రతిదినమును వారు వారినై పుణ్యమును వేర్వేఱుగఁ

పాశ్చాత్యవిధానముల వీడునపుడు మనచిత్రకారులు కొందఱు జపానుచిత్రశైలి నెల యనుకరింపవలె నని తలిసెట్టి రామారావుగా రుద్ఘోషించిరి. ఆంధ్రజాతీయత చిత్రరచనలో జూపుటయును ఆంధ్ర వ్యక్తిత్వము చిత్రనిర్మాణములఁ జూపవలెననియు నతఁడు ప్రోత్సహించిన కళావేత్తయని తెలియును. అట్టి సంప్రదాయ మనుసరించిన వారి శిష్యులుకూడ కొంద ఱున్నారు. అడవి బాపిరాజుగారు సుప్రసిద్ధకవులును చిత్రకారులునై వివిధచిత్రరచన లొనర్చిరి. కాశీనాథుని నాగేశ్వరరావుగారు చిత్రరచనల 'భారతి'లో ప్రకటించి రచయితలకుఁ బ్రోత్సాహమొసంగి నేటికాలమున కళను ప్రోత్సహించిరి. 'భారతి'లోఁ బ్రకటితములైన రేఖాచిత్రము లన్నింటిలోఁ 'తలిసెట్టి' వారి చిత్రములుచాల హృదయంగమములై జనాకర్షణీయము లైనవి. రాజమహేంద్రవరమున పార్కులో ఆంధ్రాస్థానకవులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి విగ్రహము శిల్పవిన్యాసముతో నిర్మించిన నారీమణి బొల్లాప్రగడ వెంకటచలమమ్మ ఆంధ్రశిల్పకారులలోఁ బేర్కొనఁ దగును.

బ్రాంజి అనఁబడు లోహనిర్మాణము లైన శిల్పములు పెక్కుమంది దేశనాయకులకును తదితరప్రసిద్ధులకును నిర్మింపఁబడినవి. గాంధీమహాత్ముని యాకారమును శిల్పములలోను చిత్రరచనలయందును ననేకవిధముల వ్యాప్తినందినది. ఆయారచనావైశిష్ట్యము చూపిన కళోపాసకులు స్తుతిపాత్రులు. ప్రాచీనబౌద్ధశిల్పచిత్రాకారములను దలపించు నేటి గాంధీమహాత్ముని శిల్పచిత్రరచన లసంఖ్యాకములై కళాకౌశలమును వేనోళ్ళ చాటుచున్నవి.

అతఁడే శాంతమనోజ్ఞమూర్తి దరహాసామోదవీక్షానమం
చితసుశ్లోకుఁడు భారతావనికి దాసీత్వంబు వాపంగ జీ
వితదీక్షావిధి పూను జోదు మృదుగంభీరారవం బొప్ప ని
ర్మిత జాతీయ సమైక్యతాచతురుఁ డా మేధావి గాంధీయసత్.

హైందవ శిల్పకళావేత్తలలో మహాత్రి, కర్మార్కర్, తాలిము అను బొంబాయి శిల్పకారులయొక్కయు నాగప్ప అను మద్రాసుశిల్పి యొక్కయు నామధేయములు సుప్రసిద్ధములు. అయినను ఊహాశక్తి యందును శిల్పమునఁ బ్రత్యేకతఁ జూపుటలోను రాయిచౌదరి అత్యుత్తమశిల్పి యనఁ జనును. స్పర్శగుణము శిల్పమునఁ జాల ముఖ్యమగుటయు నట్టి గుణవిశేషము రాయిచౌదరిగారి శిల్పములందు గానవచ్చుటయుఁ దెలియఁ దగును. స్నాయువుల సున్నితమగు నిర్మితి, జిలుగు వలువల మెత్తందనము నెమ్మల కాఠిన్యగుణము మొదలగునవి చౌదరి శిల్పములలో నేర్పున నేర్పరింపఁబడినవి. మఱి యాతనిశిల్పము లుత్కృష్టమగు జీవకళాచైతన్యములు గల్గియున్నవి. ఆధునికశిల్పతత్త్వము నాకళించుకొని వీరిశిల్పములు కళాప్రదర్శనములలో ఘనబహూకరణము లొంది ప్రాచ్యపాశ్చాత్యులందఱి మెప్పును గొన్నవి. చౌదరి శిల్పములలో నాతని జనకుని శిల్పనిర్మాణమునం దూహాశక్తియు భక్తిప్రపత్తులు నేకీభావము గాంచినవి.

## పరిశిష్టము

శ్రీదేవీకరుణాకటాక్షవీక్షణమున ననంతసృష్టి నిర్మితి యైనది. ప్రత్యణువునందును రచనావిశేషము ప్రాదుర్భవించున ట్లొనర్చిన సృష్టికర్త మహిమ మూహాతీతము. అట్టి భగవత్ప్రసాదసమాసాదితప్రతిభాశక్తిమూలముననే లలితకళావిన్యాసము లలవడుచుండుట విస్మితవిషయము. అట్టి కళావిశేషము లనంతములు.

అందు శిల్పరచనలు కొన్నికళల కమ్రరూపము లగును. వేదకాలమునుండి యవిచ్ఛిన్నముగా నభివృద్ధి నొందుచు వివిధము లగు కూర్పులతో మార్పులతో కోవిదులకును సామాన్యజనులకును హృదయంగమము గానుండి శిల్పచిత్రరచనలు కనులపండు వొనరించుచున్నవి.

వేదకాలమునాటి దేవతామూర్తులు ద్రావిడుల హస్తవిన్యాసములలో వలరారి యార్యసంస్కృతి నభివృద్ధి నొంది బౌద్ధజైన యుగంబుల నించుకించుక మార్పులఁ జెంది ప్రోఢి బొందినవి. అజంతా ఎల్లోరా గుహాలలో డాగియుండి సూక్ష్మదృష్టులకు గోచరించినవి. మతాచార్యుల మహిమాదులచే నూరూర నాకళా రచనలు పయనము సాగించెను. రాజపుత్రయుగమున రంగులతో పొంగులతో మానవ జగత్తునందు వాస్తవికత నలవరచుకొన్నవి.

శిల్పనిర్మాణములు మొగలుల యంతఃపురముల నుండి వెల్వడి జగద్విఖ్యాత మగుచలువరాతి కట్టడముల శాశ్వతియశస్సు నొందినవి. హైందవ శిల్పుల మతాభిమానమునందు అనంతసౌందర్య విరాజమానము లగుదేవతాలయరూపంబుల వర్థిల్లినవి. అక్కచెల్లెండ్రవలె కలిసి మెలిసి వలపు లూరించి భక్తి నభివృద్ధినొందించి దేవాలయకుడ్యములందును దేవతావిగ్రహములందును అంతఃపురరమ్యహర్మ్యములందును అనంతగోపుర శిఖరనిర్మాణములందును, అభేద్యశిల్పవిన్యాసములతోడను అతిరుచిర చిత్రరచనాలంకారములతోడను వృద్ధినొందినవి. శ్రీశైల శిఖరమునందును హిమాచలసానువులందును మృగరాజుల గంభీరాకృతులలో వరటాకారండవాదుల నడలబెడంగులతో నేవేళల రమ్యతఁ గూర్చినవి. మహాశివుని తపోవనంబునఁ బ్రశాంతి నొందిన రమ్యకళావిశేషములు, పార్వతీహృద్యరూపశృంగారములఁ బొంగిపొరలిన రచనావిశేషములు, దక్షాధ్వరధ్వంసాదిదృశ్యముల భీభత్సములైన కళావిన్యాసములు, మృగయావినోదమున ముచ్చటగొల్పిన రచనలు, నాటీమణుల నడలపోడిములో, చీరెల సింగారములలో, తడఁబడ నడుగుల మాంద్యములో సర్వతోముఖాభివృద్ధి గాంచినవి.

నేడుగూడ కందువాల కమ్ములలో పాలువల నగిషీలలో చీరెల అంచులలో చిత్రవిచిత్రపద్మాకరములలో పసుపుపారాణిపూతలలో

మకరికాలతలలో తిలకములతీరులలో నలంకరింపబడుచున్నది కళాలక్ష్మి. దినదినాభివృద్ధి గాంచుచున్నది. ప్రతినిమేషమును శిల్పచిత్రరచనలు వృద్ధిపొందుచున్నవి. "దుర్గమార్ధజలగౌరవభారతభారతీసముద్రము దరియుంగ నీదను విధాతృనకైనను నేర బోలునే" అని వాగనుశాసనుఁడు వాకొనినట్లు శిల్పచిత్రకళాగాంభీర్యములు చెప్ప సాధ్యముకానివి. అట్టి కళల లోతుపాతుల కొలతబద్దతో కొలుచుట, ఇదమిత్థమని నిర్ణయింపఁ బూనుట, కేవల మసాధ్యమని చెప్పనగును. అయిన నవకాశమగునంత దనుక దేశకాలావధులగురించియు నాకాలముల కలాలక్ష్మీవిలాసము లెట్లు చిద్విలాసగమనంబుల నలరారినవో కొంత విన్నవించితిని. అంతమే లేని జగదంతరరహస్యము లెట్టివో శిల్పచిత్రకళావిశేషనిరూపణముకూడ నట్టిదే యగును. చారిత్రకదృష్టితోఁ గళాభివృద్ధి ప్రాచీనార్వాచీనకాలములలో నేయేరీతుల ననుసరించెనో ఎట్టిభావనావిశేషముల ప్రాక్ష్యముగాఁ దోఁచెనో ఎట్టిప్రకృతివిచిత్రముల వెల్లడించెనో ప్రచురమొనరించితిని. నాయీరచనవలన శిల్పచిత్రరచనలలోని సౌందర్యవిశేషములఁ దెలిసికొను కుతూహలము జనసామాన్యమునందును పండితమండలియందును గూడ వృద్ధిపొందునని నాయాశయము. పాశ్చాత్యదేశముల జ్ఞానాంధకారములో నడంగిననాటినుండియు దివ్యజ్ఞానతేజఃపుంజంబులు వెదజల్లు భారతాంబపుత్రుల కళావిన్యాసము లాచంద్రార్కముగా నలరారుగావుత మని పార్వతీపరమేశ్వరులఁ బ్రార్థించువాడనయి యీకావ్యము ముగింతును.

---

# శశికలావిలసనము.

శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి.

కవితల్ గల్గురసం బెఱుంగఁగల ప్రజ్ఞావంతురా లైననీ
కవివేకాత్ముఁడ నేను దెల్పఁగలనా? యందాలకుం దావులౌ
పువులన్ నీయకుగుందముల్ విడువకే పూజింతు నేనాఁటికే
నవలోకించి ముదంబు నింతు వనుగాథాపేక్షఁ గాత్యాయనీ!

మ. తరుణం బియ్యదిదాఁటనీయక భవద్దాసుండ నౌనాకు సం
బరముల్ గూర్చుట నీకు ధర్మమునుమా! పాలించి మే లెంచి నీ
కరుణాపూర్ణపయోనిధిన్ మిగులవేడ్కన్ నన్నుఁ దేలింపుమా
సిరియుల్ సంపద నాకు నిశ్చయముగా సిద్ధించుఁ గాత్యాయనీ!

మ. శ్రమ లీ వెన్నిఘటించినన్ సరియె నీసంసేవమాత్రమ్ము నా
కమరన్ జేసినఁ జాలు; నా శ్రమలు బ్రహ్మానందమున్ గూర్చు స
త్యముగా; నీదగుకార్య మేదయినఁ జేయన్ జిత్త ముప్పొంగెడున్;
సమయం బియ్యది; నన్ను నేలుకొనఁగా జా గేల? కాత్యాయనీ!

శా. పాపాత్ముం డితఁ డంచు నన్ను విడువన్ భావ్యంబె? పైపె చ్చదో!
కోపం బూనెద; వేమిచేయుదును? దిక్కున్ మొక్కు నీవేనుమా;
నీపాదంబులచెంతఁ మోకరిలి నిన్నే వేఁడుచున్నాఁడ; నన్
బో పొ మ్మన్నను వీడిపోఁగలనె? యామోదింపు; కాత్యాయనీ!

మ. ఇతరుల్ మిక్కిలికూర్పువార లయి నేనే నీకు వేత్రాతినా?
శ్రితుఁడన్, దాసుఁడ నైనయందులకొకో చేపట్ట కీలీల దు
స్థితిపా ల్జేసెద వీవు? నమ్మితిని నిశ్చింతన్ ననున్ గూర్మితో
హితముల్ గూరిచి ప్రోతు వంచుఁ బ్రియమి మ్మింకైనఁ గాత్యాయనీ!

మ. పలుకుల్, చూపులు, మానసం బమృతపూర్ వారాశి నిక్కమ్ము నీ;
కలు కెందేనియు నిల్వఁగాఁగలగొకో యాస్కార? మీదీను న
గ్గలపున్ వేడుక నొందఁజేయఁగఁ గటాక్షశ్రీఁ బ్రసాదింపఁగా
వలదే? నమ్మినబంటు నిట్లు విడువన్ భావ్యంబె? కాత్యాయనీ!

మ. సరసంబై విలసిల్లు నీశశికలాసౌందర్యసౌభాగ్యసం
భరితాంతఃకరణమ్మ యాశయమునమ్మా నాకు ముమ్మాటికిం
హరు వొందింపుము నాకవిత్వమును నీయానందతత్త్వామృతా
విరతాంచత్సురవాహినీగరిమఁ బ్రాపింపించి కాత్యాయనీ!

మ. జవసత్త్వమ్ములుపోయి, హాయి నిఁకఁ గాంచన్ లేనిసంసారసం
కవినిర్మగ్నుల నుద్ధరించుటకు దీక్షన్ గొన్నవిద్వాంసురా
లవో! నీ విప్పుడు నన్నుఁ బ్రోవవలదా? లక్ష్మీశ్రీకళావంతమౌ
భవదంచత్కరుణాకటాక్షములు నాపై నించి; కాత్యాయనీ!

మ. అసహాయస్థితి హెచ్చిపోయె; ఋణబాధా! దుర్భరం బాయె; మా
నసమా? నొచ్చె; ఋణమ్ముఁదీర్చు టెటులో! నాకేమియున్ దోఁచదీ
వ్యసనం బేకియు దాఁటఁగాఁ గలనొ? నీ వాలించి పాలింపవా?
వసుదాంకమ్ము ధరించియుండితివిగ-వా నీవు! కాత్యాయనీ!

మ. నిను విశ్వాసముతో సదా కొలుచుచుంటిన్; నీవు సద్యఃప్రసా
దిని వౌటన్ బ్రకటింప వేమిటికి? నాదీనత్వ మీనాఁటికిన్
దునుమన్ బూనక యుంటి వేమిటికి? భక్తు న్నీ వుపేక్షింపఁగాఁ
జనునే? దేవి! సమస్తభక్తసుఖదా! సామోద! కాత్యాయనీ!

ఉ. అన్నద వన్నసన్నుతిని నందితి వీవుగదమ్మ! మాగృహం
బన్నము వెల్లియై వెతల నందుచునుండఁగఁ గాంచెమేని నీ
కున్నదె జాలి? ముం దెపుడొ యున్నతి నిచ్చెద నంట; మంచిదే;
నిన్నటు నేను గొల్చుటేక నెమ్మది నెమ్మది నుండకుండినన్!

ఉ. పంతముఁ బట్టి వార్ధకము పైపయి దూఁకుచు నక్కటా! మన
శ్శాంతినిఁ దూల్చుచున్న దెటు సల్పఁగ నోపుదు నీనుతిన్ జరా
ధ్వాంతగవిప్రభాబిరుదభాసిత వే మొ! భవచ్ఛ్రితుం డిటుల్
క్లాంతి నడంగఁ గాన; విడె గారముఁ జూపుటొ చెప్పు? మీశ్వరీ!

---

# మహాశ్వేత

శ్రీ టి. భాస్కరరావు.

ప్రాతఃకాలము; పూర్వ దిగ్వని సంప్రాప్తానురాగంబుతోఁ
జేతు ల్సాఁపెను గోముగాఁ; బయికి వచ్చీరాని మార్తాండు న
స్మితసాంతము ప్రేమపూర్ణమయి వేవేల్గులన్ వెలార్చెన్, సరో
జాతప్రేయసి రేకు విప్పి మదికిన్ సంసిద్ధ సర్వార్థయై.

శ్వేతకేతువు లక్ష్మినిఁ జేరఁ బిలిచి
"ఏంటివే ధర్మపత్ని! ఉద్వేగ శీల!
తల్లిఁ బోలిన పుత్త్రుని ధన్యుఁ డనుట;
ధన్య నొకనిఁ గంటివి వాఁడు దారి తప్పె."

అనినన్ నివ్వెర వోయె లక్ష్మి; మొగమం దారాట తోరాడఁగాఁ
గనుల న్నీళులు గారఁగాఁ బలుకలన్ గాద్గద్య మేపారఁగా
మునినాథుం గని పుత్త్ర వర్తనము నామూలంబుఁ దెల్లంబుగా
వినిపింపన్ వలె నంచు వేఁడుకొనియెన్ విక్షుబ్ధ చిత్తంబుతోన్.

"అది యొక పెద్ద గాథ; ఇపు డంత ప్రయోజనకారి గాదు; స
హ్యమది వహియింపు మింక; ననుమానము మానుము; నేఁటితో నిరా
పద మగు వాని జీవితము; పావన శావక మాతృదేవతా
హృదయ సమీప వర్తిగ రహించి సుఖించును లెమ్ము ముందటన్.

పుట్టిననాఁటి దోసమును బోల్చి ప్రతిక్రియ చేయనందునన్
గట్టిడి బుద్ధి లబ్బి కొఱగానితనమ్మున నల్పపారుఁడై
గిట్టెను బుండరీకుఁడు; సఖీ! భయ మొందకు; మంత్రిపుత్త్రుఁడై
పుట్టెను వాఁడె యుజ్జయినిఁ; బూర్వకృతంబును దప్పరాదుగా!

వాని మనంబులో మొదలు వాసన మోసము చేసె; దానితో
మానవరూపముం దొలఁగె; మారుతి ధూత విశీర్ణ పత్ర మ
స్తి నగ గహ్వరాంతర నిరంతర సంచర దుగ్రజంతు సం
త్రాసము వింధ్య కాననమునం బడె వెంబడి చిల్కరూపునన్.

పతన వేగముచేఁ గడు బడలిపోయి
దృష్టి యానక గ్రుడ్లు దిర్గిర భ్రమింప
దిక్కు తోఁపక దప్పిక రెక్కసంగ
తక్కు లాడక బాధ భరింపలేక.

నేలను మూర్ఛ గ్రమ్మ శయనించినఁ గాంచె నొకానొకండు జా
బాలిమునీశ్వరాశ్రమ నివాసి; నిసర్గదయాప్రపూర్ణుఁడై
కేల గ్రహించి మే నిమిరి క్రిందికి వ్రాలు శిరంబు నెత్తి నీ
లాలజలంబుఁ బట్టి పదిలంబుగ నూపిరి యూదె నోటితో.

తేరుకొన్నది కీరము; తేలికైన
దపుడు మునిబాలకుని కరుణార్ద్రహృదియు;
వెంటఁ గొనిపోయె మునివాటి కింటనెగురు
బలము చేకూరు పఱకుఁ గాపాడఁ దలఁచి.

అచట జాబాలి కీరమ్ము నరసి, సర్వ
వేత్తయై పూర్వకథ యెల్ల వెల్లడించెఁ;
దత్ప్రభావమ్ముచేత గతస్మృతిం గ
డించి నీబిడ్డ నేఁడు దుఃఖించుచుండె.

నిన్నఁ గపింజలుండు దయనీయ తదీయ తురంగ రూప సం
ఛన్నత వీడి వచ్చి తన సంగతి నాకు నెఱుంగఁ జెప్పి ఓ!
యన్నల మిన్న! ఆత్మసఖు నారయఁగాఁ జనె వింధ్యభూమికిన్;
గన్నుల వత్తు లుంచుకొని కంటిఁ గుమారు భవిష్యదర్థముల్.

మిత్రుని మాటయున్ వినఁడు; మేలు దలంపఁడు; నేటిప్రొద్దు తా
పత్రియ మెక్కుడై ప్రణయపంజరమందునఁ జేరనెంచి పే
రాతమతో బయల్వెడలె నంతర మెంచక; అంతులేని యీ
యాత్ర ప్రియా! దురంత నిరయం బగు రెక్కలురాని పక్షికిన్.

కావున నేఁడు నీవు చనఁగావలెఁ; గావలఁడైన సూనునిం
గావవలెన్; బ్రియా హృదయ కంజము రేకులు విప్పఁగావలెన్;
నీవుగ నీవలెన్ బ్రణయినీ గణనీయ మధూదయమ్ముతోఁ
బావన నూత్నజన్మపరిపాటియు వానికిఁ దారయిత్రివై."

అని శ్వేతకేతు వనఁ బె
ల్వన చన హిమహత సరోజ సఖమైన ముఖం
బున లక్ష్మి "నాథ! నాథా!
తనయుం గొని తేర వలవదా!" యని కదలన్.

"ఆఁగవె! పుత్త్రిరక్షణ సమాచరణ త్వరమాణచిత్త! ఉ
ద్వేగము నిగ్రహించుకొనవే! అట నేమి యొనర్తు వే యిటుల్!
వాగుర పన్ని పట్టుకొని వానిని దెమ్ము హిమాద్రి కింతలో
నీ గృహమందు శాంతులు ముగించి మిమున్ గనఁగొందు నచ్చటన్."

అనిన నాథుని పదముల కంజలించి
సెలవు గ్రహియించి యేగె లక్ష్మీపురంధ్రి;
అటఁ జిలుక యాశ్రమము వీడి యడవిఁ గడచు
నా శ్రమము నోర్వలేక మూర్ఛాబ్ధి మునిఁగె.

ఆ యెడరు తగ్గి వైశం
పాయనుఁ డినుమంత చూపు పఱపెడునరికిన్
బోయఁడు నిలఁబడె భీకర
కాయముతో వలలతోడఁ గాలునిలీలన్.

కొట్ట వచ్చినట్టు గోచరించెను నట్టి
క్రూర భావ మెల్లఁ దేరి చూచి
జీవితాశ యెల్ల భిన్నమై పోవంగఁ
జిలుక వానితోడఁ బలికె నిట్లు.

"అన్నా! ఎవరవు? నన్నిటు
కన్నులఁ బెట్టుకొని యేల కనఁగొందువు? నా
తెన్నునఁ బోనియ్యవె! ఆ
పన్నశరణ్యా! అగణ్యా భాగ్యము గల్గున్."

ఆలకించి బోయఁ డంజలి ఘటియించి
"సామి! 'ప్రాఁత పలుకు సారు లెఱిఁగి
పలుకు వింతచిలుక కలదు తె'మ్మని తెల్ప
గూడెమందు రాచకూఁతు నాకు.
తల్లి మాటవెల్లఁ దలఁ దాల్చి పూవట్లు
వచ్చి నిన్నుఁ జూచి మెచ్చుకొంటి"
యనుచు నాతఁ డంత హస్తంబులను జాఁప
వెనుక కొదిగె శుకము వెఱపుతోడ.
"పూర్వ జన్మమందు మునిపుత్త్రుఁడను నేను
గలిగె నిట్టి జన్మ కర్మ వశత;
శిక్ష చాలు నాకుఁ జెలికాండ్రు గనకుండ
విడిచి పుచ్చుమన్న! వేఁడుకొందు."
అని మొఱక లెత్తి తల నిడి
కనుఁగొలఁకుల నీరు గ్రమ్మఁగా వైశంపా
యనుఁ డా మొఱకుకు వలగొనె
మనమందున నుల్లు లేచి మఱఁగుచు నుండఁగ.
"పెరిఁగి కలుచు తెలివి పెడతల పట్టెనా?
చాటు కలదె బ్రతుకు బాట లోన
కూడియున్న చెలులు చూడకున్నను మానె
బొందిలోని వాని పొందు లేదె?
సామి కూఁతు మాట సాకిరి లేఁ డని
తప్పఁ గలనె? పోక తప్ప దింక"
యనుచు బోయఁ డంత నట్టహాసము చేసి
ముడుఁగు చిలుక నిట్టు రొడిచి పట్టె.
అటు లా బోయని చేతుల
నిటునటుఁ గదలాడలేక మొబ్బెఱికముచేఁ
గటకట పడుచుం గడపటి
కెటులో మది వెచ్చనూర్చి యిటు చింతించెన్.

"ఎంతటి పాపకర్మ మొనరించితినో యనుభోగ్య మయ్యె! హా!
హాంత! అసహ్యవేదనల కాశ్రయ మైతిని; దేహశోష్మ నా
ధ్వాంత మడఁచిన బాష్పజలధారలతోఁ గరఁగింపఁ గాదు; గ
త్యంతరశూన్యమౌ బ్రతుకు దారిని దీరుప నాకు నెవ్వరో!
చల్లనితల్లి వాత్సల్యవల్లి మహాప్ర
భావయౌ లక్ష్మిగర్భమునఁ బుట్టి
భువనత్రయీ నిత్య పూజిత చరణుఁడౌ
శ్వేత కేతుల యంకసీమఁ బెఁగి
నిర్మల మందాకినీ తీర భూముల
నమరబాలురఁ గూడి యాట లాడి
గంగాధర కృపా తరంగితేక్షణముల
నాధ్యాత్మికానంద మాకళించి
కడకుఁ బక్షినై యీ ఘోర కాననమునఁ
గటకటా! చెప్పరాని యిక్కట్లు పడితి;
బోయజవరాలి చేతిలో బొమ్మ నౌచు
నెట్లు జీవింపఁ గలను నే నింక మీఁద!
మూఁడు లోకములకు మూల మెవ్వరు తల్లి!
నీవ కాక యాశ్రితావనమున;
చెడె నటంచు నన్ను విడనాడ వలదమ్మ!
కావు మమ్మ! తనయుఁ గరుణ తోడ."
బోయఁ డా చిల్క నట్లు గొంపోయి పోయి
శబర రాజ తనూజ కొసంగి నిల్చె;
చిలుకఁ గని యామె చెక్కులఁ జేర్చుకొనిరెు
నయన శుక్తుల ముత్తెముల్ బయలువడఁగ.
"రార! నా చిట్టి! రార! బంగారు తండ్రి!
ఎన్ని నాళ్లయ్యెరా! బాబు! నిన్నుఁ జూచి;
ఎంత దురపిల్లినావొ యేకాంతమునకు!
భయము లే దింక సుఖముగా బ్రతుకు మిచట."

అనుచు ఱెక్కలు దువ్వుచు నామె చిలుక
నొక్క పసిఁడి పంజరమందుఁ జిక్క నుంచి
యార్రముగ్గిన పండ్ల యాహార మిడిన
శుకము పలుకదు; పండ్ల మూచూడ దపుడు.
"మంచి మంచి ఫలము లెంచి తెచ్చితి నీకు
భోజనంబు మంచి పుష్టి నిచ్చు;
మునులకైనఁ గాని తినవచ్చు ననవచ్చు
వీని మాన వలదు వెఱ్ఱి తండ్రి !
పావనం బైన నీదు 'జీవనము' నందుఁ
బ్రథమ వర్ణముఁ గోల్పడి బడలినావు;
దురితకర్మలచేత దుందుడుకుచేత
'ద్విజత' కర్థాంతరము సమర్థించినావు.
ఇప్పు డింక నీకు విచార మేల? పుట్టు
వొకటి వర్తనం బొకటియై యొప్పు గనునె?
కలుగరాదు భోజ్యాభోజ్యముల విమర్శ;
చూడ వలయు నాపద్ధర్మమాత్ర మొకఁడు."
అను బోయొత మాటలలోఁ
గనఁబడు సంస్కార మెంచి గ్రహియించెను బం
డ్లను; వినిపింపఁడు పౌర పా
టున నేని కళా సుధా పటుస్వర మెపుడున్.
చిలుక యొకనాఁడు తెలవాఱఁ దెలివి వచ్చి
ఱెక్క లల్లార్చి యిటునటు దృష్టి పఱుపఁ
బరిచితాచ్ఛోద కాసార పవన తతులు
నెయ్యమునఁ బోలె నెమ్మేను నిమురఁ దొడఁగె.
బోయ పల్లె కాని బోయ లెవ్వరుగాని
చుట్టుపట్లఁ గనులఁ గట్టలేదు;
రాచకూఁతు మేన మేచక కాంతులు
చూచు వారి యెడఁద దోఁచుకొనును.

కొంత దూర మందుఁ గొబ్బరిచెట్టున
గెలలు పఱఁడి నిగ్గు గెలుచుకొనియె;
ఉదయ భానుఁ జూచి యుర్వర పులకించె;
పుష్ప తతుల లతలు పోహణించె.

"పలుకవె వైశంపాయన !
పలుకే బంగార మాటవె! పలికినఁ గాదే
చిలుకకుఁ దెలివిడి యబ్బుట!
పలుకవలయుఁ బుండరీక ! ప్రాణము లేవక."

అనెడు బోమెత పలుకుల నాలకించి
శ్వేతయును దాసి యచటికిఁ జేరరవుడు;
పూర్వ జన్మ గాథలఁ దప్పివి పోయు నట్లు
చిలుక "ప్రియసీ!"యని పిల్చె చిలిక మధువు.

"స్వామి" యని పల్కె శ్వేత యంభ స్తరంగ
మట్లు పొదివికొని యెడఁద కదుము కొనియె;
"ప్రియసీ! ప్రియసీ!"యని పిల్చె నతఁడు;
"స్వామి! వచ్చితివా!" యని పల్కె నామె.

మూఁడు మాట లాడ ముగిసెను ముచ్చట;
నిలువు గ్రుడ్లు పెట్టి తలను వ్రాల్చు;
చిలుక వంకఁ జూచి చెలికత్తె దేసఁ జూచి
వెఱ్ఱి దానివోలె శ్వేత నిలచె.

ఆ నిరర్థ నిశ్శబ్ద వాతావరణముఁ
గలఁచి వినవచ్చినది కపింజలుని వాక్కు;
కాంచి రండఱు నంత నాకసము దెసకు;
ముగురు మూర్తులు నేలకు దిగుచు నుండిరి.

శ్వేతకేతు వాఁడు శీతభానుఁ డాఁడు
పుండరీకుఁ డాతఁ డుండె నడుమ;
మంత్రి దంపతులు సమర్థ దంపతులును
జేరి రటకు మునికుమారు వెంట.

పూజ్యుఁడు రోహిణీధవుఁడు బోధకుఁడై యిటు తెల్పెఁ "జ్రేమ సా
మ్రాజ్యము కష్టసాధ్యము సుమా! విరహంబున కోర్వలేక స
న్న్యాజ్యము చేసె నీతఁడు రుషాగ్నికి; బాంధవ మెంచి నాదు సా
యుజ్యము నిచ్చి నే నమృత యోగము గూర్చితి వీని కచ్చటన్".

అని వచించి "కల్యాణ మ"స్తంచు శ్వేత
హస్త మిడెఁ బుండరీకుని హస్త మందు;
శ్వేతకేతువు మొదలుగాఁ బెద్ద లిడిరి
క్రొత్త జంటకు దీవనల్ గూర్మితోడ.

బోమెత లక్ష్మిన్మయి విరియఁ బోసిన దాశిషముల్ శిరంబులన్
బాయని ప్రేమతోడ; మునిబాలకుఁడైన కపింజలుండు నా
ప్యాయముగా వచించె నిరువాగుల వారి నొకళ్లొకళ్లకున్;
ఆ యువదంపతుల్ సవినయమ్మునఁ జేసిరి వందనమ్ములన్.
సురుచిరమైన చైత్రి మది; చూత కిసాలము లెట్టి నెట్టనై
తరుణ హృదంబుజాతములఁ దార్చుచునున్నవి; పారిజాతముల్
సరసుల కింపు నింపు పరుసమ్మున ముమ్మర మయ్యెఁ; జిల్ల ప
య్యెర మరుచేతి కేతనము నెత్తె వియుక్తల మందుఁ బొందుగా.

ఇది

సమావేశము

సర్గము సమాప్తము.

---

आत्मा स्कन्धो यदि भवेदुदयव्ययभाग्भवेत् ।
स्कन्धेभ्योऽन्यो यदि भवेद्भवेदस्कन्धलक्षणः ॥१॥

यदि स्कन्ध आत्मेत्युच्यते, तदाऽयमात्मा उत्पादविनाशवान्भवेत् । स्कन्धानामुत्पादविनाशशालित्वात् । नचैवमिष्यते आत्मा । तथासत्यात्मनो विनाशाद्भोक्तुरभावात् । 'भुंजीतात्मार्जितं कर्म न चान्येन कदाचन' इति वचनविरोधः । कृतहान्यकृताभ्यागमप्रसङ्गश्च । एवं तावदात्मा स्कन्धो न भवति, नापि स्कन्धव्यतिरिक्तः । तथासत्यस्कन्धलक्षणो भवेत् । संस्कृताः, हेतुप्रत्ययसम्भूताश्च स्कन्धा उत्पत्तिस्थितिभङ्गलक्षणाः । नैवंलक्षण आत्मा । तथा च खपुष्पवदविद्यमानस्वभाव एवात्मा भवेत् । तस्मात् स्कन्धव्यतिरिक्तोप्यात्मा न सम्भवत्येव ।

ननु तैर्थिकाः स्कन्धव्यतिरिक्तं, भिन्नलक्षणं चात्मानमाचक्षते । नित्यः, अकर्ता, भोक्ता, निष्क्रियः, निर्गुणश्चेति तस्य लक्षणमामनन्तीति चेत्सत्यम् । स्कन्धव्यतिरिक्तस्यात्मनो लक्षणमामनन्ति तैर्थिकाः । न ते यथावदात्मनस्स्वरूपमुपलभ्य तस्य लक्षणमाचक्षते । किंतु संवृतिसत्यादपि परिभ्रष्टाः, अनुमानाभासमात्रविप्रलब्धाः, मिथ्याकल्पयैव उपायप्रज्ञप्त्या, आगमेन च नाममात्रकमेवात्मानं परिकल्पयन्ति । तस्य लक्षणमप्याचक्षते । तेषां च कर्मकारकपरीक्षादिषु आत्मोपादानयोः परस्परापेक्षिकीं सिद्धिं ब्रुवता प्रतिषेधो विहित एवेति नाऽत्र प्रतन्यते ॥१॥

एवम्—

आत्मन्यसति चात्मीयं कुत एव भविष्यति ।
निर्ममो निरहंकारः शमादात्मात्मनीनयोः ॥२॥

आत्मानुपलंभादात्मप्रज्ञप्त्यधीनं स्कंधपञ्चकमात्मीयमपि सुतरां नोपलभ्यते। तथा च अहङ्कारविषयस्यात्मनः, ममकारविषयस्य स्कन्धपञ्चकस्य चानुपलम्भान्निर्ममो निरहङ्कारश्च योगी भवतीति भावः ॥२॥

ननु योऽसौ निर्ममो निरहङ्कारश्च योगी स तावदस्ति, सति च तस्मिन्सिद्ध आत्मा स्कन्धाश्चेति, तत्राह—

निर्ममो निरहङ्कारो यश्च सोऽपि न विद्यते ।
निर्ममं निरहङ्कारं यः पश्यति न पश्यति ॥३॥

आत्मनि स्कन्धेषु च सर्वथाऽनुपलभ्यमानेषु कुतस्तद्व्यतिरिक्तः पदार्थो भवति । योऽसौ निर्ममो निरहङ्कारश्च भवति । तथा च यस्यैवमविद्यमानस्वरूपं निर्ममं निरहङ्कारं च पश्यति स तत्त्वं न पश्यतीति विज्ञेयमिति भावः॥३॥

एवम्—

ममेत्यहमिति क्षीणे बहिश्चाध्यात्ममेव च ।
निरुध्यते उपादानं तत्क्षयाज्जन्मनः क्षयः ॥४॥

सत्कायदृष्टिमूलाः सर्वे क्लेशाः । सा च सत्कायदृष्टिर्बाह्याभ्यन्तरयोरात्मीययोरनुपलम्भे निरुध्यते । तस्याः प्रहाणे कामाद्युपादानं प्रहीयते । एवमुपादानक्षयाज्जन्म क्षीयते ॥४॥

ननु कर्मक्लेशक्षयान्मोक्ष इति स्थितम् , कर्मक्लेशानां कस्य क्षयात्परिक्षय इति चेदुच्यते—

कर्मक्लेशक्षयान्मोक्षः कर्मक्लेशा विकल्पतः ।
ते प्रपञ्चात्प्रपञ्चस्तु शून्यतायां निरुध्यते ॥५॥

अहर्निशं रूपादिकं विकल्पयतो बालपृथग्जनस्य रागादिलक्षणाः क्लेशा उपजायन्ते । ते च विकल्पाः कर्तृ कर्म क्रिया कारक फललक्षणात्प्रपञ्चादुपजायन्ते । सच प्रपञ्चः सर्वभावानां निःस्वभावदर्शनरूपायां शून्यतायां निरुध्यते। तस्मात् शून्यतैव सर्वप्रपञ्चनिवृत्तिलक्षणत्वान्निर्वाणमित्युच्यते ॥५॥

ननु भगवद्भिर्बुद्धैरात्मा, अनात्मा च दर्शितः । तत्कथं सर्वभावानां निःस्वभावत्वदर्शनसिद्धिरिति चेदुच्यते—

आत्मेत्यपि प्रज्ञपितमनात्मेत्यपि देशितम् ।
बुद्धैरात्मा नचाऽनात्मा कश्चिदित्यपि देशितम् ॥६॥

हीनमध्यमोत्कृष्टभेदेन विनेयास्त्रिविधाः । तत्र हीनानां विनेयानामकुशलकर्मकारीणामकुशलान्निवर्तयितुं बुद्धैः कश्चिदात्माऽस्तीति प्रज्ञपितम् । ये तु मध्यमा विनेयाः सत्कायदर्शनाभिनिवेशिनस्तेषां तदभिनिवेशशिथिलीकरणार्थं,

निर्वाणाभिलाषसंजननार्थं च क्वचिद्बुद्धैरनात्मा नेत्यपि देशितम् । ये तु परमगम्भीरमौनीन्द्रप्रवचनार्थतत्त्वावगाहनसमर्था विगतात्मस्नेहाश्च तेषां बुद्धैरात्मा वा अनात्मा वा न कश्चिदस्तीति देशितम् । यथैवात्मदर्शनमतत्त्वं तथैव तत्प्रतिपक्षभूतमनात्मदर्शनमप्यतत्त्वभूतमेव । तस्माद्विनेयविशेषमाश्रित्यायमात्मोपदेशः । न परमार्थत इति भावः ॥६॥

यदि बुद्धैरात्मा, अनात्मेति वा न देशितं, किं पुनर्देशितम्? उच्यते—

निवृत्तमभिधातव्यं निवृत्तेश्चित्तगोचरः ।
अनुत्पन्नानिरुद्धा हि निर्वाणमिव धर्मता ॥७॥

इह यदि किंचिदभिधातव्यं वस्तु स्यात्तदुपदिश्येत बुद्धैः । तादृशं च किमपि नास्ति । तस्मान्नैव किंचिदुपदिश्यते बुद्धैः । कस्मात्पुनरभिधातव्यं नास्तीति चेदुच्यते— यतो निवृत्तिरेव चित्तस्य गोचरो विषय इत्यर्थः । यदि चित्तस्य कश्चिद्गोचरस्स्यात्तदा तत्र किञ्चिन्निमित्तमध्यारोप्य वाचां प्रवृत्तिस्स्यात् । यदा तु चित्तस्य विषय एवाऽनुपपन्नस्तदा क्व निमित्ताध्यारोपेण वाचां प्रवृत्तिः स्यात् । यस्माद्धर्मता धर्माणां प्रवृत्तिः निर्वाणमिव अनुत्पन्ना अनिरुद्धा च; निःस्वभावा धर्मा इति यावत् । तस्मात्तत्र चित्तं न प्रवर्तते । चित्तस्याऽप्रवृत्तौ कुत्राऽध्यारोपः? तदभावे च कुतो वाचां प्रवृत्तिः? अतश्च न किंचिदपि बुद्धैर्देशितमिति । अत एव वक्ष्यति— 'न क्वचित्कस्यचित्कश्चिद्धर्मो बुद्धेन देशितः' इति ॥७॥

यद्यप्येषां 'अनुत्पन्नाऽनिरुद्धा हि निर्वाणमिव धर्मता' इति निश्चयः, तेषां नास्ति वाक्प्रवृत्तिः । तथापि संवृतिनित्यापेक्षया विनेयानां कयाचिद्देशनया भवितव्यम् । काऽसौ देशना? तत्रोच्यते—

सर्वं तथ्यं न वा तथ्यं तथ्यं चाऽतथ्यमेव च ।
नैवातथ्यं नैव तथ्यमेतद्बुद्धानुशासनम् ॥८॥

इयमत्र भगवतां बुद्धानां तत्त्वामृतस्यन्दिनी देशना आनुपूर्व्या विज्ञेया । 'अन्यया भाषया म्लेच्छो शक्यो ग्राहयितुं तथा । न लौकिकः अतो लोकः शक्यो ग्राहयितुं यथा' इत्युक्तरीत्या यदेतत्स्कन्धायतनधात्वादिकं, अविद्यातैमिरिकै-

स्सत्यतया परिकल्पितमुपलब्धं च तत्सर्वं तथ्यमित्युपवर्णितं भगवता तद्दृष्ट्यपेक्षया। तथ्यं नाम तत्। यस्यान्यथात्वं नास्ति, विद्यते च भावानां प्रतिक्षणविनाशित्वादन्यथात्वम्। तस्मादुक्तं न वा तथ्यमिति। आर्यज्ञानापेक्षया सर्वमेव मृषेत्यर्थः। चिराभ्यस्ततत्त्वदर्शनानां किंचिन्मात्रानुत्खाताचरणतरुमूलानां केषांचिदेव तथ्यं चाऽतथ्यमेव चेति देशितम्। तस्यापि किंचिन्मात्राचरणस्य प्रहाणार्थमुक्तम्—नैव तथ्यं न वा तथ्यमिति। उन्मार्गादपनीय सन्मार्गे प्रतिष्ठापनं शासनम्। विनेयजनानुरूपेण शासनमनुशासनमित्यर्थः। चत्वारश्चैते उपदेशा उपायत्वेन व्यवस्थिता बौद्धानामिति भावः ॥८॥

यद्यप्येवम्, तथापि व्यवहारसत्यानुरोधेन लौकिकतथात्वाभ्युपगमवत् तत्त्वस्यापि समारोपितं लक्षणमुच्यतामिति चेदुच्यते—

अपरप्रत्ययं शान्तं प्रपञ्चैरप्रपञ्चितम्।
निर्विकल्पमनानार्थमेतत्तत्त्वस्य लक्षणम् ॥९॥

नास्ति परप्रत्ययोऽस्मिन्निति अपरप्रत्ययम्, परोपदेशागम्यम्, स्वयमेवाधिगन्तव्यमित्यर्थः। यथा हि तैमिरिका वितथं कणमशकमक्षिकादिरूपं पश्यन्तो वितिमिरोपदेशेनापि न शक्नुवन्ति कणादीनां यथावस्थितं रूपमधिगन्तुम्। किंत्वतैमिरिकोपदेशं मिथ्येति प्रतिपद्यन्ते। यदा तु तिमिरोपघात्यञ्जनाञ्चितनयनास्सन्तस्समुत्पन्नतत्त्वज्ञाना भवन्ति, तदा तत्तत्त्वं स्वयमेवाधिगच्छन्ति। एवमपरप्रत्ययं भावानां यत्स्वरूपं तत्तत्त्वमित्यर्थः। एतच्च शान्तं शान्तस्वभावं तैमिरिककणदर्शनवत्स्वभावविरहितमित्यर्थः। अत एवैतत्प्रपञ्चैरप्रपञ्चितम्, प्रपञ्चयत्यर्थानिति व्युत्पत्त्या प्रपञ्चोऽत्र वाक्। तैरप्रपञ्चितं, वाचा अव्याकृतमित्यर्थः। विकल्पश्चित्तस्य रागः, तद्रहितत्वान्निर्विकल्पकम्, सर्वदैकरूपत्वादनानार्थम्, एकरूपमित्यर्थः। एवं तावदार्याणां तत्त्वलक्षणं वेदितव्यम् ॥९॥

लौकिकं तु तत्त्वलक्षणमधिकृत्योच्यते—

प्रतीत्य यद्यद्भवति न हि तावत्तदेव तत्।
न चान्यदपि तत्तस्मान्नोच्छिन्नं नापि शाश्वतम् ॥१०॥

यत्कारणं प्रतीत्य यत्कार्यं भवति तदेव कारणमेव, तत् कार्यमिति न शक्यते वक्तुम्। न हि बीजमेवांकुरः। जन्यजनकयोरेकत्वे पितृपुत्रयो-

रप्येकत्वप्रसङ्गः । अनन्यत्वाच्चांकुरावस्थायामपि बीजस्यापि ग्रहणं स्यात्। अविनाशाभ्युपगमान्नित्यता च बीजस्य स्यात् । एवं च शाश्वतवादप्रसङ्गः । एवं तावद्यदेव बीजं स एवांकुर इति न शक्यते वक्तुम् । नापि बीजादंकुरस्यान्यत्वं, बीजमन्तरेणापि अंकुरस्योत्पादप्रसङ्गात् । उक्तं चैतत् 'यदन्यदन्यदन्यस्मादन्यस्मादप्यृते भवेत्' इत्यत्र । अंकुरावस्थायामपि बीजस्यानुच्छेदप्रसङ्गात् । यतश्चैवं यत्कारणं प्रतीत्य यत्कार्यमुत्पद्यते नैव तत्कारणं भवति, तदेव कार्यं, नापि तस्मात्कारणात्तत्कार्यमन्यत् । तस्मान्नापि कारणमुच्छिन्नं, नापि शाश्वतमिति शक्यते व्यवस्थापयितुमिति भावः ॥१०॥

तदेवम्—

अनेकार्थमनानार्थमनुच्छेदमशाश्वतम् ।
एतत्ते लोकनाथानां बुद्धानां शासनामृतम् ॥११॥

यथोपर्णितेन न्यायेन एकत्वानेकत्वविगतं, शाश्वतोच्छेदविगतं च बुद्धानां शासनामृतं विज्ञेयम् । एतद्धर्मतत्त्वामृतं प्रतिपन्नानां श्रावकानां श्रुतचिन्ताभावनाक्रमात्प्रवर्तमानानां शीलसमाधिप्रज्ञात्मकस्कन्धत्रयामृतरसोपयोगान्नियतमेव जरामरणक्षयस्वभावनिर्वाणाधिगमो भवति ॥१२॥

यदि चेह तत्त्वज्ञो निर्वाणं नाधिगच्छति, आर्यमार्गोपदेशककल्याणमित्रप्रत्ययवैकल्यान्न भवति धर्मतत्त्वामृताधिगमः, तथापि—

सम्बुद्धानामनुत्पादे श्रावकानां पुनः क्षये ।
ज्ञानं प्रत्येकबुद्धानामसंसर्गात्प्रवर्तते ॥१२॥

अनुत्पादे सम्बुद्धानां विदितबुद्धधर्मतत्त्वानां श्रावकानां क्षये सति 'प्राप्नोति यत्नतोऽवश्यं पुनर्जन्मनि' इत्यादिवचनाज्जन्मान्तरे असंसर्गात् कायचेतसोरप्रविवेकात्, कल्याणमित्रालाभाद्वा प्रत्येकबुद्धानां स्वायम्भुवं ज्ञानं प्रवर्तते । ततश्च ते जन्मान्तरे निर्वाणमधिगच्छन्ति । तस्मादवन्ध्या सिद्धिरस्य बौद्धधर्मतत्त्वामृतस्येति भावः ॥१२॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
आत्मपरीक्षा नाम अष्टादशं प्रकरणम् ।

# माध्यमिककारिकासु,

## कालपरीक्षानाम एकोनविंशतितमं प्रकरणम् ।

ननु विद्यत एव भावानां स्वभावः, कालत्रयविज्ञप्तिहेतुत्वात् । इहाऽतीताऽनागतप्रत्युत्पन्नाख्यास्त्रयः कालाः । ते च भावाश्रयाः । कथम्? उत्पन्ना निरुद्धाश्च भावा अतीताः । उत्पन्ना अनिरुद्धाश्च वर्तमानाः । अनुत्पन्ना अनागता इति । तस्मादस्ति तन्निबन्धनो भावस्वभाव इति चेदत्राह —

प्रत्युत्पन्नोऽनागतश्च यद्यतीतमपेक्ष्य हि ।
प्रत्युत्पन्नोऽनागतश्च कालेऽतीते भविष्यतः ॥१॥

इह तावद्वर्तमानानागतौ कालौ, अपोह्यातीतं कालं भवतामनपोह्य वा? यद्यतीतं कालमपोह्य सिद्ध्यतस्तदा अतीतकाले नियतं तयोः सत्त्वं स्यात् । कुतः? यस्य हि यत्राऽसत्त्वं तत्तेन नाऽपोह्यते, यथा वन्ध्यास्त्री स्वपुत्रेणेति नियमात् । नन्वविद्यमानमप्यन्धकारं प्रदीपेन परस्परप्रतिद्वंद्वित्वादपोह्यत इतिचेन्न, तस्यापि साध्यसमत्वात् । तथाचाऽत्रापोह्य सिद्ध्यर्थमतीतकाले वर्तमानानागतकालावङ्गीकर्तव्यौ । एवं सत्यतीतकाले विद्यमानत्वादतीतकालवत्तयोरप्यतीतत्वं स्यात् । तथाचाऽतीतोपि न स्यात् । यतो वर्तमानावस्थातोऽतिक्रान्तोऽतीत इति, असम्प्राप्तश्चानागत इति चोच्यते । यदा तु वर्तमानानागतयोरभावस्तदा कुतः कस्यातीतत्वं स्यात् । अथैतद्दोषपरिजिहीर्षयाऽतीतकाले वर्तमनानागतकालौ यदि नस्त इति परिकल्प्यते, एवमपि तत्राऽविद्यमानत्वाद्गगनकुसुमवन्नास्त्यपेक्षेति स्यात् ॥१॥

वर्तमानानागतकालावतीते न स्त इतिचेत्तत्राह—

प्रत्युत्पन्नोऽनागतश्च न स्तस्तत्र पुनर्यदि ।
प्रत्युत्पन्नोऽनागतश्च स्यातां कथमपेक्ष्य तम् ॥२॥

यद्यनागतवर्तमानकालावतीते न स्त इत्युच्यते तदा अनागतवर्तमानयोरतीतापेक्षा नास्ति । कुतः? यद्यस्मिन्न वर्तते तस्य तदपेक्षा नास्तीति नियमादिति भावः ॥२॥

ननु वर्तमानानागतयोरतीतापेक्षा मास्तु, इति चेदत्राह—

अनपेक्ष्य पुनस्सिद्धिर्नातीतं विद्यते तयोः ।
प्रत्युत्पन्नोऽनागतश्च तस्मात्कालो न विद्यते ॥३॥

यतोऽतीतमनपेक्ष्याऽनागतवर्तमानयोस्सिद्धिर्नास्ति तस्माद्वर्तमानोऽनागतश्च कालो नास्तीति भावः ॥३॥

यथा चैवमतीतमपेक्ष्याऽनपेक्ष्य वा प्रत्युत्पन्नानागतयोस्सिद्धिर्नास्ति, तथा प्रत्युत्पन्नमपेक्ष्याऽनपेक्ष्य वा अतीताऽनागतयोरपि सिद्धिर्नास्ति । तथैव अनागतमपेक्ष्याऽनपेक्ष्य वा अतीतवर्तमानयोरपि सिद्धिर्नास्तीति दोषसाम्यादतिदिशति—

एतेनैवाऽवशिष्टौ द्वौ क्रमेण परिवर्तकौ ।
उत्तमाधममध्यादीनेकत्वादींश्च लक्षयेत् ॥४॥

यथा चैतत्कालत्रयं विचारितमेवमेवोत्तमाधममध्यादीनेकत्वादींश्च लक्षयेदित्यर्थः । यस्मात्कालत्रयं नास्ति ततो भावोऽपि नास्तीति भावः । अत्रादिशब्देन कुशलाकुशलाव्याकृतानि, उत्पादस्थितिभङ्गाः, कामरूपादयस्स्कन्धाः, सर्वेपि पदार्था गृह्यन्ते । । एकत्वादीत्यत्रादिशब्देन द्वित्वबहुत्वादयो गृह्यन्ते । एते सर्वेपि कालत्रयव्याख्यानेन व्याख्याता वेदितव्या इति बोद्धव्यम् ॥४॥

अत्राह— विद्यत एव कालः, क्षण दिन मास संवत्सरादि परिमाणस्य सत्त्वादिति चेदत्रोच्यते—

नाऽस्थितो गृह्यते कालः स्थितः कालो न गृह्यते ।
यो गृह्येताऽगृहीतश्च कालः प्रज्ञप्यते कथम् ॥५॥

इह यदि क्षणादिव्यतिरिक्तः कालोनाम कश्चिदवस्थितस्स्यात्सः क्षणादिभिः गृह्येत । नत्ववस्थितः कश्चित्कालो नामास्ति । प्रागेव दूषितत्वात् । तस्मादस्थितः कालो न गृह्यते । नापि स्थितः कालो गृह्यते । क्षणादिव्यतिरेकेण तस्याऽगृह्यमाणत्वात् । तदेवं व्यवस्थितः कालो नास्ति, यो गृह्येत । तदेवमविद्यमानस्वभावोऽगृह्यमाणः कालः कथं प्रज्ञप्यते भवतेति भावः ॥६॥

ननु नास्ति व्यवस्थितस्वभावः रूपादिव्यतिरिक्तः कश्चित्कालो नाम। किंतु रूपादीनेव संस्कारानुपादाय कालः प्रज्ञप्यते। स च क्षणादिशब्दैर्व्यवह्रियत इति चेदत्राह—

भावं प्रतीत्य कालश्चेत्कालो भावादृते कुतः।
न च कश्चन भावोऽस्ति कुतः कालो भविष्यति ॥६॥

एवं तावद्भावं प्रतीत्य कालः सिद्ध्यतीत्युच्यते भवता। तथासति भावसिद्ध्यधीना कालस्य सिद्धिः। भावो नास्तीति प्रागेव प्रतिपादितमस्माभिः। प्रतिपादयिष्यतेच। यदा चैवं भाव एव नास्ति तदा भावसिद्ध्यधीनः कालः कथं सिद्ध्यति। कालाभावाच्च न सन्ति क्षणलवमुहूर्तादयः। तस्मान्नास्त्येव भावानां स्वभाव इति सिद्धम् ॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु
कालपरीक्षानाम एकोनविंशतितमं प्रकरणम्।

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## सामग्रीपरीक्षानाम विंशतितमं प्रकरणम्।

इह बीजावनिसलिलदहनपवनादिहेतुप्रत्ययसामग्रीमपेक्ष्योत्पद्यमानोयमंकुरस्सत्यामपि सामग्र्यां ऋतुविशेषाऽसन्निधाने नोत्पद्यते। तस्मादस्ति कालो नाम अंकुराद्युत्पत्तौ सहकारिकारणमिति चेदत्राह—

हेतोश्च प्रत्ययानां च सामग्र्या जायते यदि।
फलमस्ति च सामग्र्यां सामग्र्या जायते कथम् ॥१॥

हेतुप्रत्ययसामग्र्या जायमानं फलं हेतुप्रत्ययसामग्र्यामस्ति वा न वा? अस्तिचेन्निष्पन्नं तत्फलं कथं सामग्र्या जायते। नहि कुण्डे विद्यमानं दधिकुण्डेन जायते ॥१॥

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు.)

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

## **1, 2, 3, 4, 5, 6** సంపుటములు

విక్రయమునకు సిద్ధముగా నున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 వ | సంపుటము | అ | మొదలు | ఔ | వరకు |
| 2 వ | ,, | క | ,, | ఙ | ,, |
| 3 వ | ,, | చ | ,, | ణ్రృ | ,, |
| 4 వ | ,, | తె | ,, | ప్ర | ,, |
| 5 వ | ,, | | | | |
| 6 వ | ,, | | | | |

కార్యదర్శి :

శ్రీ దంటు భాస్కరరావు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

తూర్పుగోదావరి జిల్లా.

Published by Andhra sahitya Parishat, Kakinada.
Edited by K. Krishna sastri
Printed yb J. Bhaskara Rao at Republic Power Printing Works, Kakinada